

ఏకాంత ప్రకృతి

—ఫోటో : జె. వి, శివరామశాస్త్రి, (హాలాహార్వ)

సంవత్సర చందా
రు. 12-0-0
విడిపత్రిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 33
28-4-54

జయ చైత్ర బహుళ దశమి బుధవారం



పంచవర్ష ప్రణాళిక

ఫొటో : నాళం కామేశ్వరరావు, రాజమండ్రి.

# విషయానుక్రమణిక





# కాలక్షేపం

కౌపీనంబును, జీర్ణకంథయును,
నపేక్షాశూన్య భైక్షంబు, జం
తూపాయంబు, వనశ్మశానముల
నిద్రావాప్తి, దుర్వార స
ద్వ్యాపారంబు, ప్రశాంతచిత్తమును,
యోగారూఢియున్, వృత్తి సం
క్షేపంబుం గలదేని, యోగికి
త్రిలోకీ ప్రాభవం బేటికిన్?

తా॥ గోచీయున్నా, చిరిగిన గుడ్డల బొంతయున్నా, యాచించకుండా లభించిన భిక్షాభోజనమున్నా, నిశ్చింతగా ఉండుటయున్నా, అడవిలోనో స్మశానములోనో నిద్రపోవుటయున్నా, సద్వ్యాపారం నిరాటంకంగా సాగుచుండుటయున్నా, ప్రశాంతమైన మనస్సున్నా, యోగసమాధియున్నా, నిలుకడగల చిత్తవృత్తియున్నా ఉన్నటువంటి యోగికి త్రిలోకాధిపత్యమెందుకు?

మూడులోకాల ఆధిపత్యం మనకు కావాలన్నప్పటికీ అది మనది కాదు. అన్నిలోకాలకూ అధిపతి భగవంతుడేగాని మానవులెవ్వరూ కారు. ఆభగవంతుని ఆజ్ఞలకూ, విధివిధానములకూ, ధర్మసూత్రములకూ లోబడి, కట్టుబడి, అడుగుదాటకుండా అనువర్తిస్తూ భగవంతునితరపు ముక్త్యారునామాతో ముల్లోకాల ఆధిపత్యం ఎవరైనా వహిస్తే వహించవచ్చు - కాని యీ ఆధిపత్యం, యీ అధికారం ఎంత చలాయించినా, ఇది అసలైన ఆధిపత్యం కానేకాదు. ఇది సర్వాధికారం కానేకాదు. జమీందారులున్నారనుకోండి. పూర్వకాలపు నవాబులు ఎవరో ఆ జమీందారీ గ్రామాలను ఆ జమీందారు యొక్క పూర్వీకులకు యిచ్చివుంటారు. ఏ షరతుమీద సదరు జమీందారీ గ్రామాలను ఒప్పచెప్పినారని ప్రశ్నిస్తే, వారికియిచ్చిన పురాతన సన్నదులనూ, ఫర్మానాలనూ, - వారిని జమీందారుగా ఆనాటి నవాబులో వారిబాబులో ముస్తాబుచేసినప్పుడిచ్చిన కితాబులనూ, తిరుగవేసి జవాబు చెప్పవలసి వస్తుంది. ఆ జమీందారీ గ్రామాలలో శిస్తులను వసూలుచేసి, సదరు డౌలు ముత్తమును నవాబుకు నివేదించాలి. నవాబు తరఫు ఏజంటుగా వ్యవహరిస్తూ, శిస్తులు వసూళ్లుచేసి సర్కారుకు జమకట్టుతూ ఉండడం కొరకై జమీందారీకి జవాబుదారీ వహించి, ఆ షరతుల ప్రకారంలో తన అధికారం చలాయించాలి.

అయితే, ఆనాటి నవాబులుకూడా ఆ విధంగానే ఢిల్లీ పాదుషాలకు లోబడిన ఏజంట్లుగా తొలుదొలుత వెలసియుండిరి. కాని, కొంతకాలానికి, నైజాము వంటి నవాబులు ఢిల్లీపాదుషాకు కప్పము కట్టుతూ, సామంత ప్రభువులుగా ఉన్నారు. ఇంకా మరి కొంతకాలానికి ఢిల్లీకి ఢిల్లీ, పల్లెకు పల్లె అన్నట్లుగా ఆ కేంద్రప్రభుత్వాధికారానికీ, యీ క్రింది ప్రభువుల అధికారానికీ సంబంధం తెగిపోయింది. "మీరు మీరే, మేము మేమే" అన్నట్లుగా ఒకరితో ఇంకొకరికి పురుళ్ళు పుణ్యాలు లేనట్లుగా, ఘటశ్రాద్ధం చేసికొని గంగ తగులవేసికొన్నట్లుగా, గోత్రం ఒకటైనా తరాలువిడిపోయినట్లుగా, సంబంధసూత్రం తెగిపోయింది.

ఆవిధంగా సంబంధం తెంపుకొని, తాను స్వతంత్ర ప్రభువు అయినట్లుగా చాటించుకొన్నవాడు నైజాము ప్రభువు. ఇటువంటి నైజముగల ప్రభువులు దేశంలో ఇంకా ఎందరో వెలసి నిశ్శంకగా నిరంకుశులైనారు. కాని, యీ స్వతంత్ర నిరంకుశ ప్రభువుల చరిత్ర ఇంకా ఉంది. ఆంగ్లేయులూ, ఫరంగీలు (ఫ్రెంచివారు) యీ దేశంలో అడుగుపెట్టి ఆడించిన భాగవతం అంతా పారాయణం చేసి చూచినట్లయితే, యీ స్వతంత్ర నవాబులను ఆంగ్లేయులూ ఫరంగీలూ తమ చేతిలోని కీలుబొమ్మలవలె ఆడించారు. సారంగపాణి (శివుని) చేతిలోని లేడిపిల్లవలె క్లయివు ప్రభువుచేతిలోనూ, దూప్లే

# కావ్యతత్త్వము

నండూరి రామమోహనరావు



పూలగిన్నెల నొదుగుతేనెల
గ్రోలుచెరుగును కొదమ తుమ్మెద.
పౌరజలధుల స్వచ్ఛసలిలము
నేరుపరచుట లెరుగు మేఘము.

సుఖము దుఃఖము రెండు చవిగొని
సుకవి తద్రస నిర్భరుండగు.
సుకవి సంభావితమ్మె ఈ
సకల జగమాస్వాద్యమే యగు.

తమో వృతమగు వస్తులోకము
తరుణ రవి భాసితమ్మగునటు,
సహృదయాస్వాదితము కావ్యము
సత్యదర్శన కారణమ్మగు.

ప్రియాంగన కనుపాపలో గని
ప్రియుడు తన రూపెరుగునట్టులు,
కావ్యలీనుండై రసజ్ఞుడు
కాంచు నాత్మ నిగూఢ తత్త్వము.

ప్రభువు చేతిలోనూ, ఆర్కాటునవాబూ, హైదరాబాదు నవాబూ నిల్చోమంటే నిల్చున్నారు కూర్చోమంటే కూర్చున్నారు. మీ తరఫున మేముచేసిన యుద్ధాలకు అయిన ఖర్చు మొత్తంక్రింద ఖజానా ఖాళీచేసి యివ్వవలసినదన్నారు. అడిగిన పరగణాలు తమ పరం చేయవలసినదన్నారు. వెల్లెస్లీ ప్రభువు గవర్నరు జనరలుగా వచ్చి బ్రిటిష్ సేనలను నవాబులకు అంగరక్షగానూ వారి అధికారరక్షగానూ యిచ్చి,ఆ సేనలకయ్యేఖర్చును అరువు ఖాతాలో ఖర్చువ్రాసి, ఆఖరుకు ఆ బాకీ ఎత్తివేయడానికి దత్తమండలములను వారు దఖలు పరచుకొన్న తర్వాత, ఆనాటి నైజాము తల తడివి చూచుకొని, మిగిలినదే మనదనుకొని, "అల్లాహో అక్బర్!" అని గడ్డం దువ్వుకున్నాడు. అటు తర్వాత డాల్హౌసీ ప్రభువు అవతరించి ఏ సంస్థానాధీశుడైనా సరే సంతానంలేకపోతే, తనవద్ద దత్తతలైసెన్సును పొందకుండా పరాయిపిల్లవాణ్ని పెంచుకొని పట్టముగట్టుటకు పర్మిషన్ యివ్వనన్నాడు. సంతానం లేకపోతే ఆ సంస్థానానికిక 'స్వధానమ స్తర్పయామి' అనే వారసుడు లేడు గనుక ఆ సంస్థానానికే యిక నీళ్లొదలాలు యిచ్చి యీస్టు యిండియా కంపెనీవారి కర్పణం చేయవలసిన దన్నాడు. "కంపెనీ సర్కార్!" అంటే కంపించేటట్లు చేశాడు మహారాజులను, మస్నేసుల్తానులను, కూడా—చీమలవలె దోమలవలె భీమసేనులవంటి సామంతులను సంస్థానాధిపతులను కంపెనీ ప్రభుత్వం ధిక్కరించి తిరస్కరించి తన కత్తి చూపించి "ఖబర్దార్!" అంది.

గవర్నర్ జనరలైన డాల్హౌసీ ప్రభువుకూడా మన ధర్మశాస్త్రం ప్రకారమే మన కర్మ జరగాలి అన్నాడు. పుత్రులులేనివాళ్లకు ఉత్తరగతులు లేవనే మాట నిజం అన్నాడు. "అపుత్రస్య గతిర్నాస్తి" అనే సూత్రం అక్షరాలా అమలు జరుగవలసినదే అన్నాడు. సంస్థానాధిపతులకు సంతానం కలుగకపోతే వారికి భారీ లెక్కను భార్యలెందుకు? భూభర్తలనే బిరుదులు ఎందుకు? స్వసంస్థాన భవిష్యత్తు విషయమై శ్రద్ధగలవారైతే, వారిలో సత్వం ఉండి వారి వారసత్వం నిలువబెట్టుకోవలెనంటే, సంతానోత్పత్తి చేయకుండా వృధా కాలహరణం ఎందుకు చేస్తున్నారు జనానాలో? అటువంటి భూభర్తలను "భర్తరఫ్!" అన్నాడు, ఆనాటి అఖిలభారత సర్వ సంస్థాన సంతాన శాసనుడైన డాల్హౌసీ ప్రభువు. మనజాతి మొగతనం పరీక్షించిన ప్రభువు ఆ జాతిద్రోహ - సిపాయిల తిరుగుబాటునకు వీరణము మోగించి డోలు వాయించినవాడు డాల్హౌసీ. "బలవంతమైన సర్పము చలిచీమల చేత జిక్కి చావదె సుమతీ!" అంతటితో కంపెనీ ప్రభుత్వం కూడా కంపించి, ఊగులాడింది. సంస్థానాధీశులందరూ ఏకమై తిరుగుబాటు చేశారు. దానినే దేశస్వాతంత్ర్య సమరం అన్నారు. దానినే సిపాయీల తిరుగుబాటు అన్నారు. కంపెనీ సర్కారు కూలిపోయింది. కంపెనీవారి వాటాలన్నీ వాటంగా అమ్మివేసికొని, యింటికి, అనగా యింగ్లండుకు, చేరుకొని, చచ్చినవాని పెళ్లికి వచ్చిందే కట్నం అన్నట్లుగా, వాటాదార్లు ఎవరి సొమ్మును వారు తీసికొన్నారు. తూర్పు యిండియా కంపెనీ, తూర్పుకు తిరిగి నమస్కారం చేసింది. అంతకు పూర్వము అక్కడక్కడ విజయ స్తంభములవలె వారి వీరుల విగ్రహాలనుకూడాకొన్ని ప్రతిష్ఠ చేశారు. కలకత్తాలో ఒకచోట, "We conquered by the sword. We rule it by the sword" "మేము కత్తితో జయించాము,కత్తితో పరిపాలిస్తాము"అని సుత్తితో చెక్కు చెదరని అక్షరాలలో చెక్కించారు. కాని, కొంతకాలం అయినతర్వాత కత్తితో పాలించలేక కత్తికి స్వస్తిచెప్పి, తోక ముడిచ బెట్టి, "నా కీ రాజ్యము కావలెనంటిన దే?" అనే పాట

## ★ కాలక్షేపం ★

పాడుతూ రంగస్థలంనుంచి ప్రక్కచాటుగా నిష్క్రమించినట్లుగా ఇండియా వీడి ఇంగ్లండు చేరినారు.

ఈవిధంగా మన భారత యితిహాసం యింతదూరం తరచి చూచిన దెందుకంటే, రాజులుగాని, రాజ ప్రతినిధులుగాని, పాదుషాలుగాని, వైస్రాయిలుగాని, తమను సర్వతంత్ర స్వతంత్ర సర్వంసహా సర్వాధికారము లున్నదన్నట్లుగా సర్వే సర్వత్ర తమ సర్వే రాళ్లు పాతించి, భూమి అంతా మాదే

అన్నారు. భూలోకం అంతా మాదే అన్నటువంటి ప్రభువులుకూడా ఉన్నారు. అలెగ్జాండరు చక్రవర్తి గ్రీసుదేశంనుంచి బయలుదేరి ఆకాలంలో ఆయనకు తెలిసినటువంటి ఇరుగు పొరుగు రాజ్యాలనన్నింటిని జయించాడు. ఇంకా తాను జయించవలసిన రాజ్యాలు ఏమేమి ఉన్నవో ఎంచి యోచించి దండయాత్రలు సాగిస్తూ ఉండేవాడు.

ఈవిధంగా భూలోకం అంతా ఆక్రమించాలనే కాంక్ష మాత్రమే కాదు. వీలైతే ఇతర గ్రహాలకు కూడా వెళ్లి మన బావుటా పాతివేయవలెననే కోరిక కలుగవచ్చు. భూలోకం, భువర్లోకం గెల్చిన తర్వాత ఇంకా సువర్లోకం కూడా గెలువవలెననే కోరిక పుట్టవచ్చు. ఈ త్రిలోకాధిపత్యం వచ్చినతర్వాత ఆ పరుగు అంతటితో ఆగదు. "వన్!–టూ!–త్రీ!" అనేవరకు కదలదుగాని, "త్రీ!" అన్నతర్వాత, పరుగు ఇక ఆగదు. అదే పూర్వకాలంలో అధికారస్వర అధికారోహణ. సువర్లోకం తనదైతే, తానే జగద్రక్షకుణ్ని అంటాడు. కవులందరూ ఆయన చుట్టూచేరి "నావిష్ణుః పృథివీపతిః" అంటారు. రాజైన తర్వాత విష్ణువుయొక్క అంశ రాజులో రాజుతూఉన్నదంటారు. ఇంగ్లండులో కూడా. "*Divine Right of Kings*" దేవదత్తము రాజాధికారము అనే సిద్ధాంతం అమలులో ఉంది. రాజు అంటే సాక్షాత్తు యీశ్వరుని ఏజంటు. దేశంలో భగవంతుని ఆరాధన విధానం సక్రమంగా జరుగుచున్నదో లేదో చూడవలసిన బాధ్యతకూడా ప్రభువుగారిదే. భూమికి అధిపతికూడా రాజుగారే రాజు అనేవాడు విష్ణ్వంశ సంభూతుడు. రాజును శిక్షించడానికి ఎవరికీ అధికారం లేదు.

ఇటువంటి బూజుపట్టిన పాత ఊహాలతో రాజు అనేవాడు యీరోజువరకు ఇంకా అక్కడక్కడ ఉంటే ఉండవచ్చు. కాని దొంగకూడా మనిషివంటివాడే అని లోకం గ్రహించిన దినంగానే, దొరకూడా మనిషివంటివాడే అని లోకం గ్రహించింది. అటువంటి ఇంగ్లండు దేశంలోనే ఇంగ్లండుకు రాజైన చార్లెసును ఆంగ్ల ప్రజలే శిరచ్ఛేదంచేశారు. ఫ్రాన్సులోని ప్రజలు తిరుగుబాటుచేసి చక్రవర్తికి మనోవర్తి కూడా యివ్వము అన్నారు. చక్రవర్తి వక్రవర్తి యగుటకు తోడ్పడిన సహకారులను, అధికారులను, సామంతులను, శ్రీమంతులను స్వాహా చేయడానికి విప్లవయజ్ఞం చేశారు. ఆనాటి ఫ్రెంచి జాతరలో ఎన్ని తలలు తరిగిరో ఆ తలలు నరికిన 'గిల్లాటిన్' యంత్రానికి కూడా తెలియదు. దానికొక మీటరుకూడా ఉండినట్లయితే, వేటుకొక జీవం దాటిపోయినదన్నే లెక్క (కిరాయి మోటారు నడచిన మైళ్లు మీటరులో తెలిసినట్లుగా) తెలిసిఉండేది. కాని, ఆనాటి ప్రజావిప్లవం మీటరులేని ధాటీతో, కోటలు, పేటలు, బాటలు, వనవాటులు ధ్వంసం చేశారు. నిప్పులు కక్కింది. నిప్పులను చేటలతో చెరిగింది. ఆ నిప్పుల రవ్వలు ఆనాడు ఫ్రాన్సునుండి ఎగిరివచ్చి ప్రక్కనున్న యింగ్లండుమీద పడి, ఇంగ్లండులోని రాజవంశ ప్రభుత్వానికి కూడా ప్రజలు "నీ నామరూపములకూ విప్లవం మంగళం" అంటారేమో అనే భీతి మాత్రం ప్రజ్వరిల్లింది. కాని, ఇంగ్లాండుకొక గండం తప్పింది.

రాజు అనేవాడు త్రిలోకాధిపతి నన్నంత ఉన్నతస్థాయిలోకి వెళ్ళితే తానే జగద్రక్షకుణ్ణి అంటాడు. తానే జగత్కర్తనని కూడా అంటాడు. తానే ప్రజాపతినని అంటాడు. తానే బ్రహ్మనంటాడు. నందిని పందిచేయగలననీ పందిని నందిచేయగలననీ, ప్రతిజ్ఞచేసి సువర్లోకంలోకూర్చుండినప్పుడు తాను చాలా ఉన్నతస్థానంలో ఉన్నానని గర్విస్తాడు. సువర్ లోకమును హిందువులు గౌరవించినా మహమ్మదీయులు గౌరవించరు. ఏమైనప్పటికీ, ప్రభువు గర్వించినప్పుడు ప్రజలు గర్జిస్తారు. అప్పుడు ఇంద్రుని సింహాసనం కూడా ఊగులాడుతుంది. ఇండియాకు, బర్మాకు, సింహళానికి ఆధిపత్యం వహించిన ఆంగ్లేయుల త్రిలోకాధిపత్యం తీరా తేరా అయింది.

ఎవడైనా త్రిలోకాధిపత్యం నిలుపుకోగలడా? నిలువబెటగలనని సవాల్ చేసి మీసం నిలువబెట్టగలడా? మొదటి ప్రపంచసంగ్రామం సాగించినటువంటి జర్మను చక్రవర్తియైన కెయిజరు మెలియబెట్టిన మీసం నిలువబెట్టలేక నిలువ నీడలేకుండా పోయినాడు. రాజ్యము వీడిపోయినాడు.

రాజ్యం అంటే వీరభోజ్యం అన్నారు. మహావీరులకే అది భుక్తం అవుతుంది అన్నారు. కాని ఆ సిద్ధాంతం అంతా త్యాజ్యం పూజ్యం అయింది. రాజ్యము అంటే "ప్రజారాజ్యం"అనే ప్రచారం చేసు త్రిలోకసంచారియైన నారదుని నినాదంగా ఉంది. నారదుడు నాటినుంచి నేటివరకు కలహాప్రియుడే. ఆ మాటలో అసత్యం లేదు. ఎక్కడెక్కడ గర్వం ఎక్కువవుతూ ఉంటుందో అక్కడక్కడ గర్వభంగం చేయడమే నారదునివంటి మహాయోగికి నిత్యకృత్యం. సత్యభామకు గర్వం ఎక్కువైనదంటే శ్రీకృష్ణ తులాభారం అనే నాటకం ఆడించాడు. రుక్మిణీదేవి తెచ్చి త్రాసులో వేసిన తులసిదళంతో భామ ఆభరణాలన్నీ భారంలేనివై ఆమెకూడా సారంలేనిదైంది. "పీసపు ముక్కనత్తు వరపీసపు మంగళసూత్ర మమ్మినన్ కాసును రాదు" అని శ్రీనాథుడు వర్ణించిన కాసల నాటివారి కనకాంగి నగలవత్తుగా సత్యభామ నగల తూకం యావత్తూ తేలిపోయింది. తేలిక అయిపోయింది, భగవంతుడైన శ్రీకృష్ణుని దృష్టిలో.

ఈరోజున అమెరికావారి ఆటంబాంబులన్నీ వారి ఆటోపంబునకు కారణమై, త్రిలోకాధిపత్యం సాధించగలమనే పైత్యం వారిలో ప్రబలమైతే, వారి స్వాతిశయం, సాత్విక తత్వోపదేశాలతో, తర్క వితర్కములతో, ధర్మచర్చలతో, చందనచారు చర్చలతో ఆ పైత్యం ఆ ఉద్దీపన ఉపశమిస్తుందా?

ఏ మహాయోగియైనా ఏ వీరభోగవసంతరాయడైనా అవతరించాలి. యోగియే వీరుడై రావాలి, వీరుడే యోగియై అవతరించాలి. సిద్ధార్థుడు రాజకుమారుడు. పరాక్రమశాలియై పరసేనల చెఱకు ముక్కలవలె చెండాడవలసిన ఘూర్కావీరుడు. కాని, అస్త్రసన్యాసం చేశాడు. రాజ్యసన్యాసం చేశాడు. భిక్షువు బయలుదేరాడు. అదికూడా "అపేక్షాశూన్య భైక్షంబు." "కరతల భిక్షం–భూతల వాసం" చేసి కటిక నేలమీద పరుండి ఆ మహారాజకుమారుడు నిర్వాణం పొందినాడు. "ప్రశాంత చిత్తమును, యోగారూఢియున్, వృత్తిసంక్షేపంబుం గలదే నియోగికి త్రిలోకీ ప్రాభవం బేటికిన్!"

దేశం దేవునిధి; రాజ్యం ప్రజలది. ఆమాట నిజమే. కాని, ప్రపంచంలో ప్రభుత్వం ప్రశాంతంగా ప్రశస్తంగా సాగాలంటే, బండీ నడిపించేది ప్రజలు అయితే చాలదు. ప్రజలూ ఉండాలి పెట్రోలూ ఉండాలి. కేవలం వోటర్ల జాబితాలు తయారుచేసి "మీ ప్రతినిధులను మీరే ఎన్నుకోండి! ఏలుకోండి!" అంటే చాలదు. అందుకు తగిన వివేకం ప్రజలలో ఉండాలి. యుక్తవయస్సు వచ్చిన ప్రతివానికీ వోటుయిస్తే లాభంలేదు. ఈడువచ్చిన పిల్ల తన తోడు తానే చూచుకుంటుంది అనే పద్ధతిగా, ప్రజలను యథేచ్ఛగా మందలో విడిచిపెట్టడం వల్ల పురుషపుంగవులే ప్రజారాజ్యంలో ప్రత్యక్షమవుతారని భావించినట్లయితే, "ప్రజారాజ్యం గోవిందా!" అనవలసి వస్తుంది. కాని, గోవిందుని వంటి గోపాలకుడు భూపాలకుడైనా ఫరవా లేదు. ఆయన వీరుడు. ఆయన భోగి. ఆయన యోగులకు

(56-వ పేజీ చూడండి)

# అయిన వాళ్లు

**కు. జానకిరామ్ పట్నాయక్**

"ఎందుకూ?......నాకేం వయిందని ఎక్సరే తీయిస్తా మంటున్నారు?"

భయం కొలిపే గొంతుతో కమల అన్నది. మరదలి మాట విని సోమేశ్వర్రావు ముఖం చిట్లించుకుంటూ బయటికి వెళిపోయాడు.

"చూడమ్మా సరోజా! డాక్టరు చెప్పాడని మీ అన్నయ్య అన్నారుగాని లేకపోతే ఇన్నాళ్లూ అనకూడదా?...అయినా ఈవడగారి స్థితి చూస్తూనే వున్నారుగా? పిల్లా జెల్లా ఉన్న యిల్లాయె!...ఇంకా అసలు సంగతి ఏమిటంటే లోకం! దానికైనా జడొద్దా? "ఇదిగో - తమ్ముడు చచ్చిపోబట్టి మరదల్ని ఆ రోగంతో అలా ఒదిలేశారు" అని మీ పెద్దన్నయ్యగారిని ఆడిపోసుకోదూ?" అని శారదాంబ కాస్త జరిగి సరోజని చెవులో నోరుంచి "ఈ జబ్బు మంచిది కాదమ్మా!......మహా గడ్డయింది! అంటుకుంటే ముట్టుకుంటుంది!" అన్నది. సరోజని తలూపుతూ, మెల్లిగా "నిజమే! వేగిరంగా మేలుకుంటేనే కాని మీరన్నట్టు పిల్లలున్న ఇల్లు! ఎలా నవ్వుతుంది మొండికేసుక్కూచుంటే?" అని జవాబిచ్చింది!

తోటికోడలు ఆడిపడుచు ఆడుతున్న మాటల్లో కొన్ని కమలకు వినిపించాయి. వెంటనే రెండేళ్ళ క్రితం చనిపోయిన పినతల్లి గుర్తొచ్చింది......ఆమె కూడా ఏదో రోగంతో బాధపడ్డది! ఆమె చుట్టుపక్కల కెవరూ వచ్చేవారు కారు! మారుమూల కొట్టు గదిలో నులకమంచంమీద పడి ఉండేది! ఆమెకోసం గిన్నె, చెంబూ, తప్పేలా — చివరకు తల దువ్వుకొనే దువ్వెనకూడ ప్రత్యేకంగా ఉండేవి! అప్పటప్పటా చూడొచ్చినవాళ్లు, కొట్టుద్వారం దగ్గర్నుంచే పలకరించి వెళిపోతుండేవారు! అరగంటకోసారి ఫినైలూ, బ్లీచింగు పౌడరూ ఆ గది చుట్టూరా పోస్తుండేవారు! ఆ త్రోవంట వస్తూ పోతున్న పిల్లలమీద పెద్దలు కసురుకుంటుండేవారు! చివరకామె తగిన దక్షత లేక, జీర్ణించి జీర్ణించి చచ్చిపోయింది! ఆ రోజుల్లోనే తను 'ఎక్సరే' పేరు విన్నది!...తిరుగా తనకు ఒంట్లో స్వస్థిగానుండేసరికి బావగారి నోటినుంచి ఆ పేరు విన్నది! వినగానే భయంతో కంపించిపోయింది!

"నాకు ఏ ఎక్సరేలూ ఒద్దు! నాకు రోజూ జ్వరం వొస్తుందా ఏమిటి? మీదగ్గరున్న థర్మామీటరు మంచిది కాదు. కాస్త ఒంటకి తగిల్తేచాలు పాదరసం నూరుడిగ్రీలకు దాటిపోతుంది! అయినా నాకిప్పుడేం ముంచుకొచ్చిందని డాక్టరుకు చూపించారు? డబ్బు గుంజడానికని ఆ అభాజనులు లేని పోని రోగాల పేర్లు వల్లిస్తారు! దాంతో మీరూ కొంపలంటుకుపోయినట్లు గాభరాపడిపోతారు! కాగా నేను పూర్తిగా మంచం పట్టిపోలేదే? ఏదో చిన్నా చిటికీపనులు చేసుకుపోతున్నానుగా!...ఈ చేదుమందులు సరిగ్గా త్రొక్కపోవటంవల్లా, రుచికోసం అపథ్యపు వొస్తువులు తినివేస్తుండటంవల్లా ఈ జ్వరమూ, దగ్గూ వొదల్లేదు! అంతేగాని నాకేరోగమూ లేదు! నాకే ఎక్సరేలూ ఒద్దు"

అంతా వింటూన్నట్టు కమల పిచ్చి పిచ్చిగా వాగింది. ఆ పరిస్థితిలో ఏం చెప్పినా, ఎలా చెప్పినా వినేటట్టు లేదని అప్పటికంతా వూరుకున్నారు!

మూడురోజుల తరువాత మాట! కమల మధ్యాహ్నం భోజనం కాజేసుకొని లేచింది! శారదాంబ చిన్నకుమార్తె వెంటనే ఆ ఎంగిలి కంచందగ్గఱ కూచుని శశితో "అక్కా! పిన్ని కంచంలో వడ్డించీవే!" అన్నది. శశి దగ్గఱసావున్న తల్లి వేపు చూసింది! అప్పుడు శారదాంబ "ఎందుకే కంచాలు మరిలేనట్టు అంత పెద్దదాంట్లో ఒడ్డించమంటున్నావ్?" అని శశితో "అదిగో ఆ బల్లమీద చిన్న కంచంవుంది. అది తెచ్చి దాంట్లో ఒడ్డించు" అని ఆజ్ఞాపించింది. వెళిపోతూన్న కమల చెవుల్లో ఆ మాటలు పడ్డవి. ఆమె తిరిగివొచ్చి" ఏమండీ అక్కయ్యగారూ! నా కంచంలో పిల్ల ఎప్పుడూ తినలేదా ఏమిటి? ఇప్పుడు తింటే ఏమయింది?" అని అడిగింది!" అబ్బే! ఏమీకాలేదు. ఇంట్లో చాలినన్ని కంచాలున్నాయిగా!" అని శారదాంబ జవాబిచ్చింది. ఆ జవాబులో గూఢంగా యిమిడివున్న వ్యతిరేకార్థం గ్రహించి మరేమీ మాటాడకుండా కమల వెళిపోయింది!

ఆ మర్నాటినుంచీ ఆ ఇంట్లో క్రొత్త క్రొత్త యేర్పాట్లు జరుగుతూండటం కమల గ్రహించింది. వంటలయ్యేదేతడవు శారదాంబ పిల్లందరికీ స్వయాన ఒడ్డించి తినిపించివేస్తున్నది. వంటా పెంటా శశి చూసుకుంటుంది. పిల్లల్ని స్నానాలు చేయించటం, తలలు దువ్వటం, దుస్తులు తొడిగించటం, టాయిలెట్లు చేయించటం, ఇల్లూ వాకిళ్లూ శుభ్రపర్చటం తలచెడ్డ ఆడపడుచు నిర్వహించుకుపోతుంది! తన నెందులోనూ చేయి కలగజేసుకోనీయకుండా అన్ని ఏర్పాట్లూ చకచకా నడిచిపోతున్నాయి!

మూడు నాలుగు రోజులు కమల ఎలానో భరించుకొచ్చింది. కాని తరువాత తమాయించుకోలేకపోయింది! "నాకు క్షయరోగం ముంచుకొచ్చిందనేనా మీ అందరి వుద్దేశాలూ?" అని శారదాంబను నిష్కర్షగా అడిగివేసింది! ఆమె అంత సూటిగా అడుగుతుందని శారదాంబ కలలోకూడా అనుమానించలేదు. అందుకని జవాబివ్వటంలో తడబడిపోయింది! "అబ్బే!...క్షయ...రోగం ... అని ఎవరన్నారు? నీకు విశ్రాంతి చాలా అవసరమని డాక్టరు చెప్పాడట! అందుకనే గాని...లేకపోతే ...ఏం వయిందని?"

కమల మరి అధికంగా మాట్లాడలేదు. ఒకొక్కటీ ఆమెకు బోధపడుతునేవుంది. చూస్తూ చూస్తూ వాళ్లు "నువ్వు క్షయరోగివి. నీ అంటు మాకు పనికిరాదు. నువ్వు మాతో కలిసిమెలిసి వుండటానికి వీల్లేదు-" అంటారా?

మరో వారంనాటి విషయం! శారదాంబ నవ్వుతూ కమల దగ్గఱకొచ్చి వెండి కంచం, రెండు కూరగిన్నెలు, ఒక గళాసు చూపిస్తూ "చూడమ్మాయ్ మీ బావగారి పని! ఇంట్లో బోలెడన్ని వెండిసామాను ఉంటుండగా నీకోసమట ప్రత్యేకంగా పురమాయించి చేయించుకు తెచ్చారు" అని వాటిని మేజామీదుంచివేసి క్షణమైనా నిల్చకుండా వెళిపోయింది.

కమల ఏమీ అనలేదు. వాటిని అక్కక్కే



కామదహనము

—చిత్రకారుడు : కార్యంపూడి కృష్ణమూర్తి, పేరాల.

వుంచివేసింది! ఆ సాయంత్రం మాత్రం వంటింట్లోనికి వెళ్ళి పిల్లలందరకూ ఒడ్డించి తినిపించింది కథలు చెప్పి నిద్రపుచ్చింది. ఆమె జబ్బుస్త్రీ ప్రవర్తన చూసి శారదాంబ చాలా అసహ్యించుకుంది కాని పల్లెత్తు మాటాడలేదు. ఆనాటి రాత్రి మాత్రం భర్తతో "మీ మరదలి తలబిరుసుతనం రోజుకు రోజూ హెచ్చిపోతున్నది ఎంత దూరంగా వుంచుదామని అనుకుంటే ఆవిడ గారంత దగ్గరి కొచ్చేస్తుంది! చూస్తే యింటిల్లిపాదికీ యీ రోగం అంటించే ట్లుంది!" అన్నది.

సోమేశ్వరరావు కాస్తసే పూరుకొని ఇలా అన్నాడు. "ఇలాగైతే కష్టఁవే! చిన్నపిల్లా చిటికెపిల్లా? ఒంటిమీది కిరవయ్యేళ్లొచ్చాయి కదా తెలుసుకో వద్దూ?...సరే! రేపే వాళ్ల నాన్నకు వుత్తరం రాస్తాను వచ్చి తీసుకుపొమ్మని! కావాల్సొస్తే నెలింటా పదింటా మందు మాకుల కని ఏదో యింత పంపించేయొచ్చు!"

"ఆలస్యం చేయకుండా రేపే ఒక ఉత్తరం రాసేయండి! ఈపీడ ఎంత వేగిరం వదిలించుకుంటే అంత మంచిది."

కమలంటే యిప్పుడింట్లో వాళ్ళందరకూ భయమైపోయింది! ఆమె గదిదగ్గరి కెవరూ వెళ్లరు! పిల్లలసలామె దృష్టిలోనే పడ్లేదు! వేళకింత ముద్ద ఎవరో తెచ్చి, వేసి, పోతుంటారు. పిచ్చాపాటి మాటాడ్డానికైనా ఆమె కవకాశం యివ్వలేదు. ద్వారం దాటి బయటికొస్తే కనిపించిన వాళ్ళంతా తలో పని పురమాయించుకు పోతుంటారు. ఆదరణా, అభిమానం లేని జీవితం ఆమెకు ఎంతో దుస్సహమైపోయింది.

ఒకనాటి సాయంత్రం ఆమె ఎవరితో చెప్పా చేయకుండా వూళ్లోవున్న మేనమామ గారింటికి వెళిపోయింది. వాకిట్లో ఆమెను చూడ్డంతో ఆమె మేనమామా, అతని భార్యా కొయ్యబొమ్మల్లా నిల్చుండిపోయారు! పిల్లలంతా అటూ యిటూ జారుకున్నారు. సభ్యతకు భయపడికాబోలు మేనమామ, రెండు నిముషాలు పోయాక ముందుకువెళ్ళి "ఏఁవమ్మా ఒకర్తెవూ ఇట్లా వచ్చేశావ్? ఒక రిక్షా అయినా చేయించుకోలేకపోయావా? రా! ఇలాకూచో!" అని వరండాలోని మంచం చూపించాడు. "ఎన్నాళ్ళనుంచో మీ మాఁవయ్యగారనుకుంటున్నారు నిన్ను చూసొద్దాఁవని! కాని ఇంట్లో చికాకులు కాలు కదపనియ్యలేదు! పాపం! నీకే విధంగానూ సుఖంలేకపోయింది! ఒకేడాదయినా నిండా కాపరం చేశావో లేదో ఆ పిల్లాడు మంచాలపాలై చివరకు తన దారి చూసుకున్నాడు! పోనీ యేదోరకంగా తనువు చల్లార్చుకుంటావూ అంటే ఈ మాయదారి జబ్బు దాపరించింది! అంతా ఖర్మఫలం!" అని ముసలి కన్నీరు కార్చింది.

మేనమామ, అతని భార్యా ఆడినమాటలు విని కమల తెల్లబోయింది! వాళ్ళకూ తన జబ్బు సంగతి తెలిసిపోయిందన్నమాట! బహుశా లోకఁవంతా అలుసుపోయిం

## ★ అయిన వాళ్ళు ★

డొచ్చు ఫలానావాళ్ళ చిన్నకోడలికి క్షయ రోగం పట్టుకుందని!

తిరుగా ఆయిల్లాలన్నది. "అయితే అమ్మాయీ! కళ్ళలో రక్తం పడుతుందటగా? ఇప్పుడేఁవయినా తగ్గిందా?"

కమలకు శరీరంనిండా ఆవరాసినట్టయిందామాట వినగానే! ఒక క్షణమైనా అక్కడ ఉండ బుద్ధిపుట్టింది కాదు. చివాల్న లేచి వచ్చినతోవను విసవిసా నడిచిపోయింది.

సరాసరి తనగదిలో దూరి తలుపులు వేసుకొని మంచంమీద పడిపోయింది. వెనక వెనకనే శారదాంబ వచ్చి "ఎక్కడకెళ్లావ్ కమలా? ఇలా నీరసంగా వుంటూన్నప్పుడు ఎందుకు తిరుగుతావ్?" అని అడిగింది.

కమల ఒక్క పుదుటన లేచి కూచొని "వెళ్లండి! నాదగ్గఱకెవరూ రావొద్దు! నేను క్షయరోగిని! నా నోట్నుంచి గుక్కలు గుక్కలుగా రక్తం పడుతూంది! నాది అంటురోగం! నా ఊపిరినుంచివచ్చే పురు

"నాన్నా! నీకో మాట చెప్తాను కాని అమ్మతో అనకుండా వుంటావా?"

"ఏమిటమ్మా; చెప్పూ!"

"ఏం లేదు నాన్నా—అమ్మకి పిల్లలపెంపకం బొత్తిగా తెలియదు."

"అదేమిటమ్మా, అల్లా అంటున్నావు?"

"లేకపోతే ఏమిటి నాన్నా—నిద్రరాకముందే పడుకోమంటుంది. మెళుకువ రాకముందే లెమ్మంటుంది!"

* * *

"ఇంతకీ ఆ మస్తాన్‌గాడి చేతివేళ్లు ఎందుకు కత్తిరించుకుపోయాయంటావ్!"

"ఏముందీ. వాడు చేతిని తీసుకుపోయి గుర్రం నోట్లో పెట్టాడు."

"ఎందుకూ?"

"ఆ గుర్రానికి పళ్లు ఎన్ని వున్నాయో చూద్దామని."

"ఊఁ! పెట్టితే ఏమైందంటావ్?"

"ఆఁ! ఏమైందీ—వీడికి వేళ్లు ఎన్నివున్నాయో చూద్దామని ఆ గుర్రం నోరు ఠక్కున మూసేసింది."

## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

గులు మీ అందరిలోనూ ప్రవేశిస్తాయ్! మీకు నారోగం పట్టుకుంటుంది! వెళిపోండి" అని పిచ్చిదానిలా కేకలు వేసింది. శారదాంబ మరేఁవీ అనకుండా మెల్లిమెల్లిగా అడుగులు వేసుకుంటూ బయటికొచ్చేసింది!

కాస్సేపయాక సోమేశ్వర్రావు వెళ్లాడు. కమల తలగడలో ముఖం దూర్చుకొని వెక్కివెక్కి ఏడుస్తుంది! అతను ఒక నిముషం ఆగి శాంత స్వరంతో యిలా అన్నాడు. "నీ ఒంట్లో బావుండనప్పుడు ఎందుకటూ ఇటూ తిరుగుతావ్? నీకు విశ్రాంతి ఉండాలనీ, మనసు బేజారు పెట్టుకోకూడదనీ, ఎక్కువ మాటాడరాదనీ, ఎప్పుడూ వుత్సాహంతో వుంటుండాలనీ డాక్టరు చెబుతున్నాడు. అందుకని ప్రత్యేకంగా ఈ యేర్పాట్లు చేయించడఁవైంది! చికాకు లేకుండా ఉంటేందుకు పిల్లల్ని రానివ్వలేదు! వీట్లకు నువ్వు కొండంత అర్థం తీసుకొని బేజారు పడిపోతున్నావ్! ఇదేఁవీ బాగులేదు! నువ్వింకా చిన్నపిల్లవు కావు! నీ శరీరం సంగతి నువ్వు చూసుకోవాలిగాని నీవెంట ఎంతకని కనిపెట్టుకూర్చుంటారు? అనవసరంగా మనసు పాడుచేసుకుంటే ఏంలాభం? కర్మలో ఎంతవుంటే అంతేగాని ఇలా రవ్వారట్టూ చేసుకూర్చుంటే ఏం బావుంటుందో ఆలోచించు! ... ఎవరేఁవనా పట్టించుకోకుండా రెండురోజాలో పికే



# కుర్చీలో మూన్నిరాగం

ఆరుద్ర

"కుర్చీలు విరిగిపోతే
కూర్చోడం మానినట్లు కొత్తరచనలన్
కూర్చెడి శక్తి నశిస్తే
చేర్చెద నొకయింత చెత్త సిరిసిరి మువ్వా!"

అని మును చెపుడో శ్రీశ్రీ
ధ్వనించెగానీ, హుషారు వార్తలు శైత్తో
పనికట్టుకు పదిపేజీ
ల నింపిన శివ! శివ! పతితలను చంపడమే.

నా కుర్చీ విరిగినచో
ఏ కుర్చీనైన చాలు, ఎంచేతంటే,
నాకంతం విడు సేకు
ర్చీ కనపడినా కలం కుషీగా ఉంటే.

ఈ వారం తలభారం!
ఏ వేళో రాయబోయి ఏదో రాస్తే
భావాలు తీర్థమై పో
గా వర్ధన్ప్రసాదమాను కనుక నహుస్తే!

పట్టావూ అంటే పెద్దడాక్టరు గారికి చూపించి ఉన్న ఆ కాస్త అనుమానం తీర్చుకోవచ్చు మాతుంది!"

బావగారిమాట చెవిని పడగానే ఆమె లేచి, బీరువామూలకుపోయి అంతా విన్నది. ఏమీ బదులాడకుండా తలదించేసుకుంది!

ఆ రాత్రంతా ఆమెకు నిద్ర పట్టలేదు. సగంరాత్రయేసరికి లేచికూచుంది. నుదురూ, శరీరమూ వేడిగా వున్నట్టనుభవించింది. గొంతులో ఏదో వుండ చుట్టుకున్నట్టుంటే గట్టిగా దగ్గింది! కఫం బయటికొచ్చింది! దీపం వెలుగులో చూసింది! అందులో ఆమె కేమీ కనిపించలేదు! కాస్త ఎఱ్ఱజీరయినా ఆమె కందులో కనిపించలేదు! మనసుకు కాస్త వూరట కలిగింది! చేతులుకడుక్కొని దీపంఆర్పి ప్రక్కమీద వాలిపోయింది!

మర్నాటి వుదయం శారదాంబ ఒక వుత్తరం ఆమె కందిస్తూ "నమ్మకల్నావో నువ్వు పరాయివాళ్లుగా చూస్తున్నావు! మీ నాన్నగారేం రాశారో చూడు!" అని వెళ్లిపోయింది.

ఆ వుత్తరం సోమేశ్వరరావు పేర వ్రాసి ఉంది.

"ఉభయకుశలోపరి! మీరు రాసిన ఉత్తరం అందింది. కమల స్థితికి విచారిస్తున్నాం! దాన్నిక్కడకు తీసుకురావటాని కేమీ అభ్యంతరం లేదు. కాని ఇది ఉత్తి పల్లెటూరు! మందూ మాకూ యిచ్చేవాళ్ళు లేరు! అంతా నాటువైద్యం! ఇది మీకు తెలియందికాదు. కనుక దాన్నక్కడుంచే తగిన యేర్పాట్లు చేయకోరిక! ఇంటిదగ్గఱ కన్నా ఆస్పత్రిలో చేర్పించటమే అన్నివిధాలా మంచిది. ఇలా రాశానని వేరే విధంగా తలంచరని అనుకుంటున్నాను. వీలయినంత త్వరలో మందు ఖర్చులకు ఏమయినా పంపిస్తున్నాను.

వెంకటేశ్వర్లు."

అది చదివి కమల కుప్పపెట్టున కూలిపోయింది. కన్నతండ్రే యిలాంటి వుద్దేశం కనబర్చినప్పుడు మిగిలినవాళ్లెలా ప్రవర్తిస్తారు? నిజంవాడుకోవాలొస్తే ఆ కన్నవారికన్నా ఈ అత్తవారే లక్షరెట్లు నయం!

మర్నాడు సోమేశ్వరరావు మోటారు తెప్పించి వాకిట్లో ఉంచినాడు. కమల పల్లెత్తు మాటాడకుండా వెళ్ళి అందులో కూచుంది. పెద్దాసుపత్రిలో మెడికలాఫీసరు టి బి. స్పెషలిస్టు, లేడీ డాక్టరు ఆమెను పరీక్షించారు! ఎక్సరే తీసి ఇంటికి పంపించివేశారు.

మూడోనాటికి ఫోటోలొచ్చాయి! సోమేశ్వరరావు శారదాంబలు ఆతృతతో వాటిని చూశారు! కమలకూడ అక్కడే వుంది! రెండు నిముషాలు పరీక్షించాక సోమేశ్వరరావు వాటిని కమల కందించి తలదించివేశాడు!

"ఫోటోల దిగువ ఏఁవిటి రాసివుంది?" శారదాంబ ప్రశ్నించింది.

"నథింగ్ స్పెషల్ ఫౌండ్" అని అతను మెల్లగా అన్నాడు.

"అంటే?" తిరుగా శారదాంబ అడిగింది!

"జబ్బులో విశేష గుణంలేదు. మామూలు దగ్గు - జ్వరమూన్నూ." అని అతడు బయటికి వెళిపోయాడు!

'లోకం పోకడ ఇలానే వుంటుంది కాబోలు' అనుకొని కమల శాంతిపూర్వకంగా నిట్టూర్చింది.



## సవరణ

గతవారం సంచిక 10-వ పేజీలో ప్రచురించబడిన 'తోడు దొంగలు' అను ఫోటోను పంపినవారు వి. తంబిగారు కాదనీ, న్యూఢిల్లీనుంచి శ్రీ టి. జగన్నాధాచార్యగారు పంపారనీ గుర్తించ ప్రార్థన. —సం.

# విజయవాడలో ఊహాసౌధాలు

క్రిందటి వారం ఆంధ్రపత్రిక-సచిత్ర వారపత్రికలో మా గుంటూరు సోదరుడి వ్యాసం చదివిన తరువాత గుంటూరు, బెజవాడ "దొందూ దొందే" ననిపించింది. ఎందుకంటే – కచ్చితంగా మా వూరి అన్నయ్యలు ఏ విధంగా సంచరిస్తున్నారో, సరిగ్గా అదే ఫక్కీలో, ఆవూరి తమ్ముయ్యలూ నడుచుకొంటున్నట్లు ఆ వ్యాసం బుజువుపరుస్తున్నది. ఈ "పెళ్లికాని అన్నయ్య" పద్ధతులు ఎలావున్నాయో కొంచెం పాఠకులకు తెలిస్తే మేలని యిది రాస్తున్నాను.

తమ్ముణ్ణి హైకోర్టు వరించిందని తెలియగానే ఈ ఊరి ప్లీడర్లందరూ ఎంత హడావిడి పడుతున్నారో చూస్తే హైకోర్టు పెట్టబోయేది గుంటూరులోనా, లేక బెజవాడలోనా అని ఎవరికైనా సందేహం కలుగకమానదు. ప్రతిప్లీడరూ గుంటూరులో తామొక ఆఫీసు తెరుస్తామనీ, అక్కడికి తమరూ రావాలనీ, రాకపోతే కనీసం ఇక్కడి పనన్నా చూస్తూ కొత్త జూనియర్స్‌ను కనిపెట్టుకొని ఉండమనీ గుమాస్తాలను అడుగుతున్నారు. ముసలివాళ్లు ఇక్కడే ఉండిపోతామంటే, కుర్రకారు "గుంటూరుచలో, చలో గుంటూ"రంటున్నారు. రెండూళ్ళ మధ్యా తిరిగేందుకు వీలుగా ప్రతివారూ కొద్దిలో కారు ఏదైనా కొందామా అని ఆలోచిస్తున్నారు. ఆ కారులో ఎక్కి "రెయిల్వేటరు" బ్రిడ్జిమీదుగా—"థేమ్సు" నదిని దాటినట్లు—'క్రిష్ణను దాటిపోతున్నట్లు తమని తాము పగటికలలో చూచుకొని పక్కున నవ్వుకొంటున్నారు.

రెయిల్వేటరు బ్రిడ్జికి శంకుస్థాపన జరిగింది; తరువాత పని జరిగినా జరక్కపోయినా క్రిష్ణలో రాత్రిళ్ళు వాల్గు దీపాలు వెలుగుతున్నాయి. ఆదీపకాంతులను చూసి సంతోషపడి ప్రతివారూ పని త్వరగా కానిమ్మని ప్రభుత్వానికి అర్జీలు పెట్టుకొంటున్నట్లు అనధికార వర్గాల ద్వారా అతి విశ్వసనీయంగా తెలుస్తోంది.

బ్రిడ్జి షని పూర్తై రాకపోకలు యథేచ్ఛగా కొనసాగే దశ వస్తే అప్పుడొక 'ట్రయాంగ్యులర్ సిటీ ఫార్మ్' అవుతుందని, క్రొత్తగా కట్టిన టి. వి. ఆర్. పార్కులో స్వగ్రామాభిమానులైన మాథమెటీషియన్స్ అనుకొంటున్నారు. ఈ త్రిభుజానికి గుంటూరు, బెజవాడ, తెనాలి గ్రామాలు మూడూ మూడు అగ్రాలనీ, అందులో శీర్షము గుంటూరో, బెజవాడో తేలటంలేదనీ, —ఏది తేలినా తేలకపోయినా తెనాలి మాత్రం శీర్షం కాలేదనీ— పై వర్గాలవారు ఘంటాపథంగా బుజువు చేసి చెప్పుతున్నారు. తాడేపల్లి ప్రాంతంలో అప్పుడే చాలమంది స్థలాలు కొంటున్నట్లు ధ్రువపడింది.

అసలే చుక్కల్ని తాకుతున్న ఇళ్ళఆద్దెలు యింకా ఆకాశాన్ని అంటుకొంటున్నాయి. పాత పూరిల్లులో ఒక్క గదికి ఇరవై రూపాయలకు తక్కువ అద్దె వుండడంలేదు. త్వర త్వరగా కాఫీ హోటల్సు క్రొత్తవి తెరవటం జరుగుతోంది. అందులోనూ మరీ బొత్తిగా ప్రాథమిక కాఫీహోటల్స్ కాక, పెద్దపెద్ద వాటిల్లో చాలవాటికి శంకుస్థాపనలుకూడా జరిగాయి కొత్త హోటళ్ళకోసం, క్రొంగొత్త ప్లీడర్లకోసం సరికొత్త సైన్ బోర్డులు కావాల్సి వచ్చినవాళ్లు, పెయింటర్ల దగ్గర క్యూలో నిల్చొంటున్నట్లు తెలుస్తోంది. మాఊళ్లో అనాదినుంచీ పాలల్లో నీరుకలపటం మానేసి, నీళ్ళలో మాత్రమే పాలుకలిపి అమ్ముతున్నారనీ సగర్వంగా చెప్పుకుంటున్నాను. ఇంక చాలమంది బెజవాడకు పట్టబోయే భోగాన్ని గూర్చి పరిపరివిధాల వూహించుకుంటూ ఆరుబయట పక్కలపై పడుకొని ఆకాశంవంక చూస్తూ తారాబలం, చంద్రబలం గుణిస్తున్నారు.

'లయోలా' కాలేజీ ఇంకెక్కడా పెట్టకుండా బెజవాడలోనే పెట్టటం మూలంగా రోమన్ కాథలిక్కుల దృష్టిలో బెజవాడ, 'మద్రాసు తర్వాత మద్రాసు వంటిది, భాగ్యనగర్ తరువాత భాగ్యనగర్ వంటిదీ' ఐవున్నట్లు బుజువైంది. నిర్మాణదశలో వున్న ఈ కాలేజీ భవనాన్ని, 'ఆ పేరు వీపుమీద రాయించుకొని ఊళ్ళో తిరుగుతున్న జీప్‌ని చూసి, "బెజవాడ అదృష్టాన్ని ఎవరు చెబుపగలరోయ్" అనుకొంటున్నారు; యీవూరి వాళ్లుఅంతా.

ప్రపంచంలో పొడుగులో మూడో స్థానం సంపాదించిన యీవూరి ప్లాట్‌ఫారంపై తిరుగుతున్న రైళ్ళ హంగామా చూచి కొందిశీకులు పరదేశీయులు మూర్ఛపోతున్నారని స్టేషన్‌లో తిరిగే బికారి తెల్పుతున్నాడు.

సమావేశాలు జరగని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు భవనం, సంరంభాలు చెలరేగే విశాలంధ్ర కార్యాలయం మాసి ఆంధ్ర రాష్ట్రానికి అనధికార రాజధాని ఇదే అని రాజకీయ నాయకులు రొమ్ములు చరుచుకొంటున్నారు.

రాజకీయాల వేడితాకిడి బెజవాడలో— అందునా ముఖ్యంగా 'ఈ మున్సిపాలిటీ వ్యవహారాలలో—బాగా కన్పిస్తోంది ఈ మున్సిపాలిటీ వ్యవహారాల్లో 'కర్నూలు' ప్రభుత్వ జోక్యం ఉన్నట్లు భావించబడటంచేత కర్నూలు తర్వాత రాజకీయాల వేడిలోను, అసలు వేడిలోను బెజవాడకే గండపెండేరం అని, ఆ విధంగాను బెజవాడే అనధికార రాజధాని అని తర్కం తెలిసిన పండితులంటున్నారు. ప్రభుత్వం గుర్తించినా గుర్తించకపోయినా, తాము విజయవాడను అనధికార రాజధానిగా గుర్తించేస్తామని వీరంటున్నారు.

బెజవాడ ముఖాన ఒక విధమైన రంగారు బంగారు రంగ రంగుల శుభకళ కన్పిస్తున్నట్లు పలువురు పేర్కొంటున్నారు.

ఇరవైఏడుకు పైగా సినిమా డిస్ట్రిబ్యూషన్ సంస్థలు కలిగి, ప్రతి తెలుగు సినిమా ఔట్ డోర్ షూటింగులోనూ పాలు పంచుకొంటూ, పదకొండుకుపైగా హాల్సుతో విరాజిల్లుతూ, నటశేఖరుల నివాసభూమియై ప్రతి తెలుగు, హిందీ, తమిళ, ఇంగ్లీషు తదితర భాషాచిత్రాలకైనా 'ఏ' క్లాస్ సెంటరై, శోభిల్లుతూ సినీరంగంలో అవిచ్ఛిన్నంగా రాజ్యమేలుతూ, అసమానంగా కీర్తిని సంపాదించిన మకుటంలేని రాజధానిగా విజయవాడ చలామణీ అవుతోంది.

రాజకీయాలు ఏదారిపట్టినా యీ మహాపట్టణానికిగల ఈ ఔన్నత్యాన్ని ఎవరూ పోగొట్టలేరు.

—చక్రధారి ★

# ★ పరాజితవ్యక్తి ఎవరు? ★

గత వారం ప్రచురించబడిన 'పరాజిత వ్యక్తి' నాటికలో తెరముందు భాగోతం ఎంతఉందో తెరవెనక భాగోతం అంతఉంది. నాటికను కొస్త పరిశీలనగా చూసినట్టయితే పరాజితవ్యక్తి ఎవరన్న సందేహం ముందు కలుగుతుంది. ఫాక్టరీ నిర్వహణలో తాను అవలంబించుతున్న విధానాన్ని విడిచిపుచ్చి, ఫాక్టరీని యూనియన్ నిర్వహణకు వదిలేసి చివరకు, యూనియన్ మీటింగులో "నేను ఓటమి అంగీకరించాను. మీరు గెలిచారు" అని చెప్పినప్పటికీ సాంబయ్య ఎంతవరకు పరాజిత వ్యక్తి అనిపించుకుంటాడన్న సందేహానికి అవకాశం ఉంది ఎందుకంటే ఈ సాంబయ్య ఈమాట అనకముందు అనేక విషయాలు రూఢిచేసుకున్నాడు: యూనియన్ నిర్వహణకింద సమ్మె లుండవని ఇంజనీరు భాస్కరరావు చెప్పాడు; తన కొడుకే మేనేజరు; తన నిర్వహణ కింద కన్న బాలెన్స్ షీట్ అనుకూలంగా ఉంది; ప్రతి నెలా లాభాలు వస్తాయని భాస్కరరావు హామీ ఇస్తున్నాడు; లాభాలకోసం పనివాళ్లు త్యాగాలు చేస్తారనికూడా అతను భరవసా ఇస్తున్నాడు! బాలెన్స్ షీట్ చూడకముందు సాంబయ్య అనే మాటలను బట్టి మనకు ఒకటి స్పష్టంగా తెలుస్తూనే ఉంది: ఏనాడు యూనియన్ నిర్వహణ తనకు అనుకూలంగా లేకపోతే ఆనాడు ఫాక్టరీని తను లాగేసుకుంటాడు! ఇదంతా చూస్తూ సాంబయ్యను పరాజిత వ్యక్తి అనుకోవటం సాధ్యంకాదు ఎందుకైనా మంచిదని సాంబయ్య ఆఖరులో పనివాళ్ల ఎదట భాస్కరరావు తన అల్లుడు కాబోతున్నాడని ప్రకటించేస్తాడు ఆ క్షణంలో అది పనివాళ్లకి ఆనందకరంగా తోచవచ్చుగాని, రేపు పనివాళ్లకూ యజమాని సాంబయ్యకూ మధ్య వ్యవహారాలు చెడిస్తే అల్లుడైన భాస్కరరావు మామగారికి పూర్తి విరోధి కాలేడు ఈవిధంగా సాంబయ్య తన భావిపరాజయానికి గల కారణాన్ని ఒకదాన్ని బలహీనపరిచేస్తున్నాడు.

సాంబయ్య కొడుకు వినాయకరావు సాంబయ్యకు విరుద్ధంగా ఉన్నట్టు కనిపిస్తాడుగాని ఆ ఇద్దరిలోనూ వస్తుతహా ఏమంత వ్యత్యాసం లేదు. మరోతరానికి చెందినవాడు కావటంచేత, తన తండ్రి పనివాళ్లను వంచించటానికి ఉపయోగించే సూత్రాలు ఈకాలానికి పనికిరావని తెలుసుకుంటాడు చివరలో సాంబయ్య తెలుసుకున్న విషయాన్ని వినాయకరావు మొదటినుంచీ తెలుసుకుంటాడు తన తండ్రిచుట్టూ ఉండే శాస్త్రులూ, శర్మలూ, రావులూ, స్వాములూ మొదలైనవారిలో అతనికి నమ్మకంలేదు. కాని భాస్కరరావులాగా అతను పనివాళ్ళ అభివృద్ధికి కైంకర్యం అయిపోయిన వ్యక్తి కాదు; వాళ్ల అభిమానం ద్వారా తాను లాభం పొందవచ్చుననుకునే వ్యక్తి అన్ని విషయాలలోనూ అతను భాస్కర్ లాగే ఆలోచించేవాడలే కనిపిస్తాడు, కాని చెల్లెలితో మాట్లాడేటప్పుడు ఒకక్షణంపాటు, తన చెల్లెల్ని అడ్డం పెట్టుకుని భాస్కరరావు నాటకం ఆడుతున్నాడని సందేహం కలిగి అతను విసుసుకుపోతాడు. భాస్కరరావూ, వినాయకరావూ కార్మికుల పట్ల ఒకేబుద్ధిగలవాళ్లయితే అతనిట్లా విసుసుకుపోనవసరం లేదు. ఫాక్టరీ యూనియన్ నిర్వహణ కిందికి వచ్చే సమయానికి వినాయకరావు తనను తాను మేనేజరుగా ప్రతిపాదించుకోవటం కేవలం యుక్తితో కూడుకున్న పని భాస్కరరావూ, వినాయకరావూ ముందుగా, మాట్లాడుకున్నప్పటికీ వినాయకరావు ఈ సూచన చేసేదాకా భాస్కరరావుకు తెలియదనేది స్పష్టం తన తండ్రికి విజయం సంపాదించిపెట్టి, అది తమ విజయమని పనివాళ్ళూ, వాళ్ళ నాయకుడైన భాస్కరరావూ అనుకుంటూ, ఉభయపక్షాలు ఒకరినొకరు అభినందించుకుంటున్న క్షణంలో వినాయకరావు చాలా తెలివిగా వెనకే ఉండిపోతాడు.

వినాయకరావుకన్న కూడా లోతైన పాత్ర అన్నపూర్ణ ఈ నాటకంలో ఆమె నిర్వహించే పాత్ర ఎక్కువభాగం దాచిపెట్టబడింది. కాని జాగ్రత్తగా చూసినట్టయితే ఆమె మాటలలోనూ ప్రవర్తనలోనూ అనుమానాలకు తావిచ్చే అంశాలు చాలా ఉన్నాయి. భాస్కరరావు తన తండ్రితో ఘర్షణపడిన కొద్ది క్షణాలకే ఈ అన్నపూర్ణవచ్చి తన అన్నతో తాను క్లిష్ట స్థితిలో ఉన్నట్టు చెబుతుంది. అన్నపూర్ణను బాగా ఎరిగివున్న వినాయకరావు ఆమెను మొదట్లో "సీరియస్"గా తీసుకోడు. అటువంటివాడిచేత "ఇది సీరియస్సే" అనిపించి, అన్నపూర్ణ ఆ తరవాత మెల్లిగా ఫాక్టరీ విషయాలను గురించి అన్నచేత మాట్లాడిస్తుంది. సమ్మె విషయం అడుగుతుంది. అన్న ద్వారా తెలుసుకోవలసిన సంగతులు తెలుసుకున్నాక, "నా విషయం వొదిలేసి సమ్మెవిషయం చెబుతా వేమి"టని ఎదురు ఆక్షేపిస్తుంది. రెండో రంగంలో ఈ పాత్ర ప్రవర్తన గూఢమూ అనుమానాస్పదమూ అనే భావించవచ్చు. భాస్కరరావుతో తన కున్నదని ఆమె చెప్పుకునే సన్నిహిత సంబంధం ఎక్కడా గుర్తుకురాదు ఆమెతో కనిపిస్తూ తిరిగిన వాళ్లలో భాస్కరరావున్నట్టు వినాయకరావుకు ఏమాత్రమూ తెలీదు అనేకాళ్ళ భాస్కరరావు తన ఇంటి చాయలలో కనిపించటం లేదని సాంబయ్యభార్య అంటుంది. తనకు ప్రమాదం కల్గిందని అన్నపూర్ణ అనిన సన్నివేశాలకు కూడా ఎవరూ ఆ "ప్రమాదం" గురించి మాట్లాడరు. కాని అన్నపూర్ణకూ, భాస్కరరావుకూ మధ్య రాగాలేదనుకోవటానికి లేదు యూనియన్ నిర్వహణవల్ల తనకు నష్టం కలిగిందని భాస్కరరావు అంటాడు భాస్కరరావు అన్నపూర్ణను పెళ్లాడాలనే ఉద్దేశంతో ఉండి పార్టీ కార్యకలాపాలంగా అన్నపూర్ణ భాస్కరరావుని పెళ్లాడవని పైకి బెదిరించినా అది నిజానికి అనవసరం భాస్కరరావుతో జరిగేదంతా చెప్పిచూశానని అన్నపూర్ణ వినాయకరావుతో అంటుంది; ఇంతకన్న ఆమె చెప్పిచూసేది ఉండే అవకాశం లేదు ఏమయినా అన్నపూర్ణ భాస్కరరావును పెళ్లాడటానికి నిశ్చయించుకునే వినాయకరావు దగ్గరికి వచ్చింది అతను పెట్టుకున్న నియమాలకు విఘ్నం రాకుండా తన కోరిక నెరవేర్చుకో గలిగిన అన్నపూర్ణ పరాజిత వ్యక్తి అసలే కాదు.

పోతే, మిగిలిన పాత్ర భాస్కరరావే అసలు పరాజిత వ్యక్తి. అతను నిష్కల్మషుడు, నియమాలు కలవాడు, కపటం లేనివాడు తనను ప్రమాదపరిస్థితిలో ఉంచి సమ్మెకోసం తనను త్యాగం చేస్తున్నవాడుగా భాస్కరరావును అన్నపూర్ణ చిత్రిస్తుందిగాని అంత వంచనకు పాల్పడే లక్షణం అతనిలో ఎక్కడా కనబడదు తన సిద్ధాంతాలను కాదనకుండా ఎవ రేవ్యూహం పన్నినా అతను సులభంగా చిక్కుకుంటాడు. ఈ భాస్కరరావు అన్నపూర్ణ ఊహించినదానికన్న కూడా అమా

(౫౮-వ పేజీ చూడండి)




సీరియల్

"శారద"

## 9

మొగల్రాజపురం రోడ్డువంపు తిరిగే మూల కొండలను ఆనుకొని పెద్దపెద్ద బండలున్నాయి వాటిమధ్య అక్కడక్కడ మొలిచిన పచ్చిక రంగురంగుల రత్నకంబళం పరచి నట్లు వుంటుంది. వీటిమధ్య కూర్చుని భాస్కర్రావు, పాండురంగ చాలా పొద్దుపొయ్యేవరకూ మాట్లాడుతూ వుండడం కద్దు. ఆ వేళ సూర్యుడు పశ్చిమాన క్రుంకకముందే వాళ్లు అక్కడికివచ్చి కూర్చున్నారు. చుట్టూ నిర్మలమైన నిరామయ ప్రకృతి దూరంగా హోరుమని వినిపించే పట్నవాసపు రొద; మరొకవంక చల్లని గాలి రోడ్డు వంపులో నిరంతరాయంగా వస్తూపోతూన్న కార్లూ, బండ్లూ, మనుషులు

వాళ్ళిద్దరే గాక చాలామంది దూరదూరంగా కూర్చుని వున్నారు కొండరాళ్లమీద. ఎక్కణ్ణించో మరువంవాసన గుమాయిస్తోంది. పాండురంగ సిగరెట్టు వెలిగించి పొగ వొయ్యారంగా ఆకాశంకేసి వొదుల్తూ "ఏమోయ్, మళ్ళీ మదరాసు ఎప్పుడు వెళ్తావు? పెళ్ళయి నెలయినా ఇంకా నీకు బైటికి రావటానికి తీర నేలేదన్నమాట " అన్నాడు ఎగతాళిగా.

భాస్కర్రావు "నే నిప్పట్లో మదరాసు తిరిగి వెళ్తానని తోచదు. మా నాన్నకి చాలా సుస్తీగావుంది. ఆయన్ని అట్లా వొదిలేసి పోవటం భావ్యమూ చెప్పు! పిన్ని పాపం చాలా దిగులు పడి పోయిందోయ్. ఆవిడ వొచ్చిన రోజుకీ ఈరోజుకీ ఎంత చిక్కిపోయిందనీ! మా అత్తయ్యే లేకపోతే మా యిల్లు ఈమాత్రం సంతోషంగానైనా ఉంటుందన్న నమ్మకం నాకు లేదు" అన్నాడు బాధగా.

పాండు ఆశ్చర్యంతో "మీ నాన్నకేం సుస్తీ? కొత్త పెళ్ళి కొడుకు గదా, ఎంతో ఖుషాసాగా వుండవల్సిందే!" అన్నాడు.

పాండురంగకేసి భాస్కర్రావు అదో మాదిరిగా చూశాడు. "నాన్న తనలో తాను ఎందుకోగాని దిగులు పెట్టుకున్నాడని తోస్తుందోయ్. ఏమిటో ఆ దిగులు బయటికి చెప్పడు. డాక్టరేమో దిగులూ చింతా పనికిరాదంటాడు" అన్నాడు.

"ఆఁ! ఈ ముసలాళ్ళకి ఏవేవో దిగుళ్లు. మనం వాట్ని నివారించలేము."

"నిజమే. కాని ఏమిటా దిగులు? ఎందుకసలు నన్నడిగితే ఆయనకన్న సంతోషంగా వుండగలవాళ్లు ఎవరూ లేరు. పెళ్ళి తర్వాతే ఆయన ఇట్లా మారాడనిపిస్తోంది నాకైతే. పోనీ—పిన్నికైనా చెబుతాడేమో అంటే—అదీ అర్థంగాదు ఆవిడగూడా మాట్లాడదాయె "

"ఆవిడకు కాస్త ఖుషాసా కలిగించటానికి ఎందుకు ప్రయత్నించరు మీరు?"

"ఎవరు? ఎట్లా?"

"ఏమో నాకెట్లా తెలుస్తుందిరా? ఆమెను సినిమాలకి వాటికి తీసుకెళ్లవచ్చు పత్రికలుకొనిచ్చి చదవమనవచ్చు మనిషి మనస్సుకి శాంతి నివ్వటానికి లక్షమార్గాలు-డబ్బుండాలి గాని!"

"నిజమే—నాకు తోచనేలేదు నాన్నమగూడా తీసుకెళ్ళవచ్చు గదు! అయితే రేపు ఏదైనా మంచి సినిమాకెళ్దాం—నువ్వుగూడా రా."

"తప్పకుండాను "

అస్తమయకాంతి కొండరాళ్లమీద రక్తారుణ రేఖలు వ్యాపింపచేస్తోంది సూర్యకాంతి క్రమంగా ముసురుకొంటున్న చీకట్లలో లీనమైపోతోంది పెద్దమనుషులు, దొంగలు, వ్యభిచారులు విజయవాడ నగరపు చీకటి కోణాలలోకి జాగ్రత్తగా నిష్క్రమించే వేళ అది. భాస్కర్రావు "రావోయ్ వెళ్దాం" అంటూ, పాండురంగతో ఇంటముఖం పట్టాడు.

అతను ఇంటికి వచ్చేసరికి ఇల్లంతా యథాప్రకారం నిశ్శబ్దంగావుంది. మేనత్త వంటచేసి దీపందగ్గిర కూర్చుని, పద్మ ఏదో చదువుతుంటే వింటోంది హాల్లో మంచంమీద పడుకుని భద్రయ్యగారు సగం నిద్రలోనో ఆలోచనలోనో మునిగివున్నాడు భాస్కర్రావు నాన్నదగ్గిరకొచ్చి "డాక్టర్ వచ్చి చూసి వెళ్లాడా నాన్నా!" అని అడిగాడు ఆయన ఏమీ మాట్లాడలేదు. 'ఆయన్నిప్పుడు నిద్రలేపటం ఎందుకన్నట్టు భాస్కర్రావు మేనత్తా పిన్నీ కూర్చున్నచోటికిపోయి గోడదగ్గిర పెద్దపెటమీద కూర్చున్నాడు

హాల్లో దీపంవెలుగు వాకిలిగుండా అక్కడికి ప్రకాశవంతంగా ప్రసరిస్తోంది. అది వంటింటికీ హాలుకీ మధ్యవున్న భోజనగది. అక్కడి దీపం ఏమంత వెలుగు నిచ్చేది గాదు తలుపునా



పద్మకి చదువు మీదికి మనసు పోవటం లేదు...ఓరకంట భాస్కర్రావు వేపు చూస్తోందామె...
"పిన్నీ సినిమాకెళ్దాం వస్తారా?" అన్నాడు భాస్కర్రావు, అక్కడి వాతావరణం భరించలేక.

దగిర కూర్చుని చదువుతున్నదల్లా పద్మ భాస్కర్రావును చూసి లేవబోయింది

"కూర్చో పిన్నీ ఫరవాలేదులే" అన్నాడు భాస్కర్రావు.

మేనత్తకూడా, "కూర్చోవమ్మా, వాడేమన్నా పరాయివాడా!" అంది.

భాస్కర్రావు కొద్దిగా పుస్తకంవేపు వంగి పేజీలోని పంక్తుల వెంట ఎడమనించి కుడివేపు తిరుగుతూ వింతశోభతో మెరుస్తున్న పద్మ కళ్ళకేసి చూస్తున్నాడు. ఆమె కళ్ళకింద, నల్లని వలయాలేర్పడ్డాయి. జుట్టు వుంగరాలు తిరిగి తెల్లని నుదురుమీద ఆడుకుంటున్నది. ఆమె కట్టిన చీరె బిగువుగా శరీరానికి బాగా అతుక్కుపోయి ప్రతి అవయవపు వొంపూ చక్కగా తెలిపిడి చేస్తోంది. దీపపుకాంతిలో వెలుగునీడలు అక్కడక్కడా పడుతూ, కష్టసుఖాల ద్వైధీభావాన్ని స్ఫురణకు తెస్తున్నాయి.

పద్మకి చదువుమీదికి మనసు పోవటంలేదు. కాశీమజిలీలలో రాకుమారులు రాక్షసులు ఆమె మనసులో ఒకపక్క మెదులుతున్నారు. పెదాలు కదులుతున్నాయి. శబ్దాలు పైకి వస్తున్నాయి. మనసు మాత్రం పరాయతంగా వుంది. ఓరకంట భాస్కర్రావు వేపు చూస్తోందామె. నల్లని కనుపాపల్లో లైట్లు ప్రతిఫలిస్తున్నాయి. ఫోటోగ్రాఫిక్ లెన్సుల్లో మల్లే, ఆ కనుపాపల్లో ఒక క్షణం పుస్తకం, మేనత్త, మరోక్షణంలో భాస్కర్రావు ప్రతిబింబిస్తున్నారు.

"పిన్నీ సినిమాకెళ్దాం వస్తారా?" అన్నాడు భాస్కర్రావు అక్కడి వాతావరణం భరించలేక.

పద్మ మాట్లాడకుండా చూసింది అతనివంక. ఆమె తలలో మల్లెపూలు నవ్వుతున్నాయి; మేనత్త, "తీసుకెళ్ళే వాళ్ళుండాలి గాని రాకపోవటమేమిటి నాయన! నేనుగూడా చూడాలనుకుంటున్నా 'స్వర్గసీమ' సినిమా బాగుంటుందిట, పిన్ని చెప్పింది" అంది నవ్వుతూ.

"వెళ్దాం అత్తయ్యా!" అన్నాడు భాస్కర్రావు.

పిన్ని మాత్రం మాట్లాడలేదు. కనీసం ఆమె మొహంలోనైనా ఆమోద సూచన అవుపిస్తోందేమోనని ఆశగా చూశాడు ఆ యువకుడు. ఏ మార్పూ లేదు ఆమె వదనంలో. "ఏం పిన్నీ!" అన్నాడు.

ఆమె ముఖంలో కొంచెం మార్పువొచ్చింది; పెదాలు కదిలాయి. "ఆ సినిమా ఇవ్వాళ్టితో ఆఖరుట. రెండో ఆటకి వెళ్దాం." అన్నది ఆమె మేనత్తవేపు చూసి. "అట్లాగే లే" అంది మేనత్త. భాస్కర్రావుకి రెండో ఆటకి వెళ్ళడం అట్టే మనస్కరించడంలేదు. నాన్న రావటానికి వీల్లేదుగదా! ఈ ఇద్దరు ఆడవాళ్ళనీ తీసుకుని తాను మొగల్రాజపురంనుంచి దుర్గాకళామందిరందాకా వెళ్ళి తిరిగి



# మంచి-చెడూ



రాత్రి ఒంటి గంటకి ఇంటికి రావటం ఎట్లా—చీకటిగదా...అని ఆలోచిస్తున్నాడతను. కాదంటే మేనత్త, పిన్ని బాధపడతారేమో! సరే—ఎందుకైనా మంచిది నాన్నని అడిగితే సరిపోతుంది అని నిశ్చయించుకొన్నాడు.

భాస్కర్రావు తండ్రి మంచందగ్గిర కెళ్ళి కూర్చున్నాడు. ఆయన ఈ సంభాషణంతా వింటూనే వున్నాడు. భాస్కర్రావును చూడగానే ఆయన లేచికూర్చుని, "వాళ్ళని తీసుకెళ్ళు నాయనా. రాత్రి మరీ పొద్దుపోతుందేమో—అటునించి అటే సుదర్శనం గారింటికి వెళ్ళి వాళ్ళని పొద్దున్నే తీసుకొద్దువుగాని" అన్నాడు. "నువ్వుకూడా రాకూడదు నాన్నా?" అన్నాడు కొడుకు. తండ్రి తల అడ్డంగా ఆడించాడు. డాక్టర్ తన్ను ఎటూ పోవద్దన్నాడని చెప్పాడు.

సినిమాకి వెళ్ళటం ఖాయపడడంతోటే భోజనాలు తొందర తొందరగా ముగిశాయి. పద్మ బహు చలాకీగా అలంకరణకి దిగింది. ఆమె బయటికి వచ్చినప్పుడు భాస్కర్రావు చూశాడు. ఇటీవల ఎప్పుడూ ఆమె ఇట్లా లేనేలేదు. ఆకుపచ్చని చీర, రవిక, మల్లె పూలు, మెళ్లో మెరిసే నక్షత్రమాల, ఆమె నిజంగా దేవతలావుంది. సరాసరి భర్త దగ్గిరకివెళ్ళి అడిగింది సన్నగా. "ఏమండీ సినిమాకి వెళ్ళనా!" అని. "వెళ్ళు...జాగ్రత్త." అన్నాడు భర్త.

భాస్కర్రావు జట్కా మాట్లాడుకొచ్చాడు. మేనత్త, అతనూ, పద్మ ముగ్గురూ ఎక్కారు. ముందు ముసలమ్మని ఎక్కించారు. తర్వాత పద్మ ఎక్కింది. ఆమె వెనకాలే భాస్కర్రావు ఎక్కి, ఆమెకు అభిముఖంగా కూర్చున్నాడు. బండి సాఫీయైన రోడ్డుమీద కుదుపులూ అవీ లేకండా నడుస్తోంది వేగంగా. పశ్చిమాన క్రుంకే చంద్రుడు ఎర్రగా భయం కలిగిస్తున్నాడు. గుడ్డివెన్నెల వాళ్ల కాళ్లమీద పడుతున్నది. మధ్యమధ్య రోడ్డు దీపాల కాంతి వాళ్ళ మొహాలమీదపడి ఒకర్నొకరు, చూసుకోగలుగుతున్నారు. చూసుకొంటున్నారు కాని ఎవరూ ఏభావమూ వ్యక్తపరచటం లేదు.

భాస్కర్రావు సినిమాగురించే ఆలోచిస్తున్నాడు. సినిమా హాలునించి సుదర్శనంగారికి ఫోన్ చెయ్యవచ్చు, తాను వస్తానని. ముందుగా చెప్తే బాగుంటుంది. ఆయనది అంకంత కొంప. ఏమీ ఖరవా లేదు. ఆలోచనలసందడిలో అతను పిన్నివైపు చూడనన్నా చూడటంలేదు.

ఆమె నల్లని కళ్ళల్లోనూ సన్నగా అందంగా కళకళలాడే ఆ చామనచాయ వన్నె మొహంలో తనను గురించిన ఆలోచనలు తొంగి చూస్తున్నాయని అతను గుర్తించనేలేదు. అది అతని తప్పు కాదేమో. అతని అంతర్యంలో పిన్ని అనే గౌరవభావమే తప్ప మరొక భావనకి అవకాశమే లేదు. పద్మ సాధ్యమైనంతవరకు బండిలో అతనివైపుకి జరుగుతోంది. బండి ఆవిడ ఇష్టాన్ని గుర్తించి వచ్చే కొన్ని కుదుపులలో అతని స్పర్శ ఇస్తోంది ఆమెకి. ముసలమ్మకి ఈ సున్నితమైన వ్యవహారం గుర్తించే ధోరణే లేదు. ఆమె తాను ఏదో ధాతసంవత్సరంలో చూసిన మూగ సినిమాలనుగురించి వర్ణిస్తోంది. బండి గవర్నర్ పేట సెంటరుగుండా పోతోంది. బజార్లు సగభాగం ఖాళీ ఐనాయి. కిళ్ళీ కొట్లముందుమాత్రం జనం గుంపులుగా నిల్చుని వున్నారు. దూరంగా దుర్గకొండ—దీపాల తోరణాలతో మెరిసిపోతోంది.

ఎట్లాగైనా పిన్ని సంతోషంగావుంటే చాలు అనుకుంటున్నాడు భాస్కర్రావు. ఆమె తన జీవిత సౌఖ్యాన్నంతా త్యాగం చేసేసింది; ఆవిడకి మరొకరకంగా న్యాయం చెయ్యటం ఎవరి తరమూ కాదు. కాని, ఇతరత్రా ఆవిడ మనస్సుకి సంతోషం కలిగించటానికి తాను ప్రయత్నించవచ్చు. ఇట్లా ఆలోచిస్తూ విద్యుద్దీపాల నీలకాంతులలో పిన్ని మొహంలోకి చూశాడు. ఆమె సమ్మోహనంగా నవ్వింది; ఆనవ్వు మరొక పరిస్థితిలో, ఇంకో వ్యక్తి సమక్షంలో ఐతే, పుష్పశరుని బాణంలా పనిచేసేదే! అంత శక్తివంతమైనదా నవ్వు. పాపం! అమాయకురాలు పిన్ని! ఈ కాస్త దానికే ఇంత సంతోషిస్తోంది. ఆమెకోసం అవసరమైతే, తానెంత త్యాగమైనా చేస్తాడు!...కాని ఏం చెయ్యగలడు?

బండి దుర్గాకళామందిరందగ్గిర ఆగింది. టైము తొమ్మిదయింది. పశ్చిమాన క్షితిజం ఎర్రగా చంద్రాస్తమయాన్ని గుర్తుకు తెస్తోంది. హాలులోంచి రికార్డు సంగీతం పెద్దగా వినిపిస్తోంది. హాలుబైట విపరీతమైనరద్దీ. భాస్కర్రావు బుకింగ్ కిటికీదగ్గిరకి వెళ్ళి కుర్చీ టికెట్లు కొనుక్కొచ్చాడు. నేల బుకింగ్ దగ్గిర 'క్యూ' పెద్ద కొండచిలువలాగు కదుల్తోంది, అరఫర్లాంగు పొడవున.

ముగ్గురూ హాల్లోకి వెళ్లారు. మేనత్త లక్ష్మమ్మగారు మధ్యన కూర్చుంది. అటు పద్మ, ఇటు భాస్కర్రావు కూర్చున్నారు. హాలంతా ఒకటే గోలగా వుంది. ఆగోలకిమించి లౌడ్‌స్పీకరులోనుంచి "జిందగీక కౌరవాఁ. జిందగీక కౌరవాన్" అనే లైలామజ్నూ పాట వినపడుతోంది. అన్ని తరగతుల్లోనూ జనం నిండుతున్నారు. లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. సోడాలు కొట్టే ధ్వని, వేడి టీ, వేరుశనగకాయల కేకలు వినిపిస్తున్నాయి తారస్థాయిలో. వేసంకాలం కావటంచేత గాలిఆడక ఊపిరి బిగబట్టినట్టుగా వుంది. విపరీతంగా ఉక్కపోస్తోంది. ఏదో చొక్కా పంచే కట్టుకునే భరించలేకపోతున్నామే మనం. ఈఆడవాళ్లుఆరేసి,ఎనిమిదేసి గజాల పెద్దపెద్ద చీరెలు,—అందులోనూ బరువైన సిల్కు చీరెలు—కట్టుకుని ఎలా భరించగలరా అని ఆలోచిస్తున్నాడు భాస్కర్రావు. పద్మ రెండుమూడు నిమిషాలపాటు మౌనంగాకూర్చుంది. ఆతర్వాత తల తిప్పి హాల్లో తనవెనక ఎవరున్నారా అని చూసింది. ఆమెవెనక మూడోవరసలోకి అప్పుడే సుదర్శనంగారు, ఆయన భార్యా, కూతురూ వస్తున్నారు.

పద్మ తొందరగా భాస్కర్రావువైపు తిరిగి "అరుగో, వాళ్లు వచ్చారు" అంది.

"ఎవరూ?" అంటూ భాస్కర్రావు అటు తిరిగి చూశాడు. "మావయ్యా!" అనుకుంటూ అతను వరసకుర్చీలన్నీ దాటుకుంటూ అక్కడికి వెళ్ళాడు.

"ఏం మామయ్యా! మీరుకూడా సినిమాకొచ్చారే!" అన్నాడు.

"అరె! భాస్కరమా! ఎవరెవరొచ్చారోయ్? నాన్నకూడా వొచ్చాడా?"

"లేదు. నేనూ, పిన్ని, అత్తయ్యా వొచ్చాం. ఇవ్వాళ మీ ఇంటికే వొస్తాం—ఆట వొదిలాక."

"తప్పకండా" అన్నాడు సుదర్శనంగారు.

భాస్కర్రావు, సరోజనివైపు చూశాడు. వొయ్యారంగా కూర్చునివుంది ఆమె. ఆమె మొహంమాత్రం కనిపించకండా ఎర్ర సిల్కుతో అల్లిన మేలి ముసుగు వేసుకుని వుంది. కళ్లుమాత్రం మిలమిలలాడుతూ, నక్షత్రాల్లాగా అందంగా అల్లిక సందులలోనుంచి అవుపిస్తున్నాయి.

"ఏం సరోజనీ మీ ఇంటికి రమ్మంటావా?" అన్నాడు భాస్కర్రావు చనువుగా.

"అభ్యంతరమా!" అంది సరోజని, ఇంకా చనువుగా.

హాలులో లైట్లు ఆరిపోయాయి. సందడికూడా గప్‌మని ఆగిపోయింది.

కమ్మని ప్లేబాక్ సంగీతంతో సినిమా ప్రారంభమైంది.

# 10

సుదర్శనంగారింటికి వెళ్ళాకగాని, పద్మ మనస్సుకి శాంతి చిక్కలేదు. సినిమా హాలులో ఉన్నంతసేపు ఆమె చాలా తడవలు భాస్కర్రావు మొహంకేసి చూసింది. తెరపైనుంచి ప్రతిఫలించినకొద్ది వెలుగులో చాలా కొద్దిగా కనిపిస్తున్న అతని వర్చస్సు ఆమెని మరింత ఆకర్షించింది. జీవితం ఆమెను మోసంచేసింది. ఆమె తన సౌఖ్యానికి ఏదైనా అడ్డదారి కనుక్కోవాలి; లేకపోతే బతక లేదు. భాస్కర్రావు నిర్మలమైన మనస్సులో ఆమె కింకా ఆమె కోరుతున్నటువంటి స్థానం ఏర్పడలేదు. దాన్ని సాధిస్తే ఇక ఆమె ఆనందానికి అడ్డం వుండబోదు. కాని ఆ స్థానం తాను ఆక్రమించుకుని, అతనిలో ఉద్రేకాలు రెచ్చగొట్టడం ఎలాగ! ఆమెకి భవిష్యత్తుమీద నమ్మకం ఉంది. కాని ఈ నిరీక్షణ అనేది చిత్రవధగా వుంది. ఎదురుగుండా ఫలహారపు పళ్ళెం నోరూరిస్తూవుంటే, తినకూడదన్న ఆంక్షవల్ల తికమకపడే పసిపిల్లలా తలక్రిందులౌతోంది ఆమె.

యథార్థానికి తనవల్ల తప్పేమీలేదని ఆమె సమర్థించుకుంటోంది. అయినా అంతరాత్మ వొప్పుకోడంలేదు సినిమా చూడ్డం మానేసి ఆలోచిస్తోనేవుంది. భాస్కరం మెరిసే కళ్ళవంక వోరచూపులు చూస్తోంది. ఆత్మవంచన చేసుకోడం పదిమందికీ జవాబు చెప్పడంకన్న బాధ. తనకు తాను నచ్చచెప్పుకోడానికి, తాను చేసేపని, లేదా తాను చెయ్యదల్చిన పని, ధర్మమైనదేనని తనకు తాను నిరూపించుకోవటం ఒక ఘడియలో ఒక రోజులో ఒక తడవతో పూర్తయ్యేపని కాదు ఎన్నోసార్లు ఎదురుతిరిగే అంతరాత్మను అణిచిపెట్టి కారణాలెన్నో కల్పించుకొని సర్దవలసి వుంటుంది. దాదాపు పదిరోజులబట్టి పద్మ ఈ సంఘర్షణలో మునిగివుంది. ఇంకా ఈ సంఘర్షణకి అంతుచిక్కలేదు. ఇప్పటికీ ఆమె ప్రతి ఆలోచనకీ అదే అడ్డుతగులుతోంది.

అయితే పదేపదే ఆమె ఆలోచనలు యావత్తూ—అటువేపే వెళ్తూ తనకు జరిగిన అన్యాయానికే బాధపోతూండడంవల ఆమె అంతరాత్మ సన్నపడి గొణుగుడుగా మారిపోయింది; ఆమె కోర్కెలే జయంపొందినట్టు కనిపిస్తున్నాయి సినిమాహాల్లో విశ్రాంతి సమయాన భాస్కరం, పిప్పికి టీ తెచ్చియిచ్చాడు. గ్లాసు అతని చేతిలోనుంచి తీసుకుంటూ అతని వ్రేళ్లు తాకిందామె. ఆమె నరాల్లో మంటలు బయల్దేరాయి. కాఫీ, టీ, ఇంకే మత్తుపానీయమూ, శరీరంలో పురికొల్పలేని విపరీతమైన, ఉద్రేకాలు ఆమెలో చెలరేగాయి. కాని అవి పైకి పొంగే అవకాశం చిక్కటం లేదు. కణతలు పగలగొట్టి బాధిస్తున్నాయి. దీని అంతు తేల్చుకోవాలనుకుంది ఆ యువతి.

ఆట వొదిలింతర్వాత సుదర్శనంగారు రెండు జట్కాలు ఏర్పాటుచేశాడు. ఆడవాళ్ళు నలుగురూ ఒక బండిలోనూ, సుదర్శనంగారు భాస్కర్రావు ఒక బండిలోనూ ఎక్కారు. సుదర్శనంగారి ఇంట్లో పక్కపక్క గదుల్లో సరోజినీ పద్మలు పడుకున్నారు. వాళ్ళ గదులకి ఎదురుగావున్న గదిలో భాస్కర్రావు పడుకున్నాడు. సుదర్శనంగారు, భాస్కర్రావు మేనత్త, కమలమ్మగారు కింది అంతస్థుకి దిగిపోయినారు.

వాళ్లు పడుకునేసరికి రెండుగంట లవుతుంది. ఆ నిశిరాత్రి సమయాన గాఢమైన ప్రశాంతి ఏదో లోకాన్నంతా ఆవరించినట్లుంది; ఎక్కణ్ణుంచో అర్థంగాని శబ్దాలేవో సన్నగా వినిపిస్తున్నాయి. బహుశా కృష్ణమీద గాలిహోరుకావచ్చు. లేక వాళ్లవాళ్ల అంతర్యాల ఘోష కావచ్చు.

పద్మ గదిలో చిన్న ట్రాన్స్‌ఫార్మర్ బల్బు మాత్రం వెలిగించి వుంది. ఆమె పక్కమీద పడుకుని ఆలోచిస్తోంది. నిద్ర రావటంలేదు. భాస్కర్రావు ఆమె గది కెదురుగావున్న గదిలోనే పడుకునివున్నాడు. నిజంగా ఎంతో అందమైనవాడు. తృష్ణతోనిండిన తన నేత్రాలకేగాదు—ఎవరి నేత్రాలకైనా అట్లాగే కనిపిస్తా డతను. ఎంతో గంభీరమైన ఆకారం; వెడల్పాటి నుదురు. ఉంగరాల క్రాపు. పద్మకి నిద్రపట్టకపోగా ఉద్రేకా లెక్కువకాసాగాయి. ఆమె కళ్ళముందు వాస్తవంగా భాస్కర్రావు నుంచున్నట్టే భ్రమకలుగుతోంది. ఆమె నిశ్చలంగా పడుకుని కళ్లు తెరుచుకుని కిటికీలోకి చూస్తోంది; తెల్లని వాయిల్ తెరమీద, గదిలోని వెలుగు పల్చగా, నీడలతో కలిసి పరుచుకుంటోంది. తెర గాలికి ఊగుతోంది. ఆ తెరమీద, నవ్వుతూ నిలబడ్డ భాస్కర్రావు బొమ్మ పడ్డట్టు పద్మ ఊహించుకుంటోంది. కలకీ యథార్థానికీ మధ్య అతి సన్నని గీతే అడ్డంవుంది. ఆ సరిహద్దు గీతలో ఉంది పద్మ. ఆమె లేచి మెల్లగా తలుపుతీసింది, దొంగలా అడుగడుక్కి వెనకంజ వేస్తూ నడిచింది. హాలంతా దారుణమైన చీకటి. హాలులో ఎడంవేపు భాస్కర్రావు గది కిటికీల తెరలలోనుంచి వెలుగు మందంగా ప్రసరిస్తోంది. పద్మ గడపదగ్గిర నిలబడి ఆలోచిస్తోంది...

ఇదంతా ఆమె భ్రమ మాత్రమే. ఆమె ఇంకా పక్కమీద పడుకునేవుంది. కళ్లు సగం మూతలుపడుతున్నాయి. కాని అంతరాంతరంలో మాత్రం ఆమె మేల్కొనేవుంది సాహసించి అతని సాన్నిధ్యానికి వెళ్ళాలి. అతని సాంగత్యాన్ని...ఏమిటీ పిరికితనం! ఎందు కిట్లా తన వొళ్లు చెమటపోస్తోంది? తనదే అయినా యీ శరీరం తల కోర్కెలకు అనుగుణంగా, తన ఆజ్ఞల్ని నెరవేర్చక ఎదురు తిరుగుతోందేం!

పద్మకి బ్రహ్మాండమైన ఆ యింటిలో తా నొంటరిగా వున్నట్టనిపించింది. ఎక్కడా చీమ చిటుక్కుమన్న శబ్దమైనా వినిపించటంలేదు. మెల్లిగా లేచింది. మంచందగ్గిర నుల్చుంది ఐదు నిముషాలసేపు. ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుంది తలుపుతీసింది. ఎదురుగావున్న గదే భాస్కర్రావుది. తనువెళ్ళి తలుపుకొడితే తీస్తాడు...ఏమిటా నమ్మకం? తీయవచ్చు;—తీయకపోవచ్చు!

పద్మ తీసిన తలుపుగుండా హాల్లోకి చూసింది. ఐదు గజాల దూరంలోనే వుంది అతని గది. అతని గది కిటికీ తెరగుండా వొచ్చే మందమైన వెలుతురు తప్ప మిగతా హాలంతా నల్లగా కాటుక రాశిలా వుంది. నడిచేవాళ్లకి తమ అడుగుల చప్పుడే హడలు పుట్టిస్తుంది. తమ చుట్టూ పెద్దపెద్ద గోడలున్నాయనీ, అందుచేత అన్యులెవరూ రాలేరనీ, భయం ఏమీలేదనీ ప్రతిసారీ జ్ఞాపకమే రాకపోతే, నిజంగా అది గుండెపగిలే ఘడియ.

పద్మ ధైర్యం కూడదీసుకుంటోంది, భాస్కర్రావు గదికి వెళ్ళటానికి. కాని ఎంతయినా మరొకళ్లకి తెలిస్తే ఏమౌతుంది అన్న దిగులు లోలోపల వేధిస్తూనేవుంది. ఆమె నరాఘోష ఆమెకి ఎక్కడలేని మొండిధైర్యాన్నిచ్చింది. మెల్లిగా తలుపు ఓరగా తీసి గబగబా అడుగులేసి భాస్కర్రావు గది తలుపు దగ్గిరకొచ్చి నిలబడింది. కాని లోపలికి వెళ్లే ధైర్యం చాలలేదు. అట్లా కొద్దిసేపు నిలబడి చమటలుపట్టి భయంతో వణికిపోతూ, తిరిగి తన గదిలోకి వచ్చేసింది. అంతూ దరీ చిక్కని ఆలోచనల ఫలితంగా తలనొప్పి ఆరంభించింది. ఆరాత్రి ఆమె నిద్రపోనేలేదు.

# ★ మంచీ-చెడూ ★

## 11

ఆరోజే రాత్రి భాస్కర్రావుకి తన గదిలోకి ఎవరో వచ్చినట్టు కల వచ్చింది. అది కలో, తన ఊహో కూడా నిర్ధారణ చేసుకో లేకపోయాడతను. ఆమె సరోజనిలాగా వుంది; మొగానికి మేలి ముసుగున్నది. తన మంచందగ్గిరకొచ్చి తన ముఖంలోకి తొంగి చూసినట్టయి అతను ఉలిక్కిపడి లేచి చూశాడు. ఎవరూ లేరు. అంతా భ్రమ అని తేలింది. అయితే, బయటికివచ్చి చూసినప్పుడు గడపదగ్గిర చామంతి రేకులు కనపడ్డాయి. ఎవరోవచ్చి అక్కడ కాసేపు నిలబడి వెళ్ళిపోయారని రూఢయిరేది. ఎవరు? ఎందుకు? ఎదురుగా వున్న గదుల్లో ఇద్దరున్నారు. పిన్నిరాదు అట్లా అనుకోడంకూడా పాపం. పోతే సరోజని మావయ్య కూతురేగా. వచ్చిందేమో! సూచన ప్రాయంగా ప్రశ్నిస్తే తేలుతుందిగదా! అయినా అట్లా దొంగతనంగా రావల్సిన అవసరమేమిటి? సరోజని అట్లాంటిది కాదే? కారణం ఏమిటి?

ఈ ప్రశ్నలకి సమాధానం దొరకలే దతనికి.

తెల్లారి—భాస్కర్రావు సుదర్శనంగారిదగ్గిర శలవ తీసుకుని వెళ్తూ, "అమ్మాయికి కులాసాగా వుందా?" అని అడిగాడు. అతని గొంతులో ద్వంద్వార్థాలు గోచరించాయి సుదర్శనంగారికి

"అమ్మాయీ! బావ పిలుస్తున్నాడు" అంటూ ఆయన సరోజని గదిలోకి వెళ్ళాడు. భాస్కర్రావుకూడా వెళ్ళాడు. ఆమె గనక తన గదికి వచ్చివుంటే, ఆమె వైఖరిలో కొంతమార్పు కనపడుతుంది. తనవరకు తను నిజం ఏమిటో పోల్చుకోవచ్చు.

సరోజని బైటికి చూస్తూ కిటికీలో కూర్చునివుంది వీళ్లిద్దరూ లోపలికి వెళ్లగానే లేచి నిలబడింది; ఆమెవైఖరిలో కొంచెం వణుకున్నమాట నిజమే. భాస్కర్రావు తన సందేహాన్ని ఎలా వెలిబుచ్చటమా అని సందేహిస్తున్నాడు. ఆమె తనరాకతో దేనికిట్లా భయపడాలి అని ఆలోచిస్తున్నాడు. మేలిముసుగులోనించి మెరిసే ఆమెకళ్ళల్లో భీతి, నిర్లక్ష్యంగా వుండాలనుకుని విఫలమౌతున్న అప్పటి ఆమె మానసికాందోళన స్పష్టంగా వ్యక్తమౌతున్నాయి. వీట్ని భాస్కర్రావు గమనించి, ఆమె రాత్రి తనదగ్గిర కొచ్చినమాట నిజమేనని నిర్ధారణ చేసుకున్నాడు. అయితే దానివల్ల ఫలితం ఏమిటి?

సుదర్శనంగారు ఈ రెండు నిమిషాల మౌనాన్ని భగ్నం చేశాడు. "కాఫీ తాగి వెళ్లొచ్చు లేవోయ్. నేను బైటికి వెళ్తాను. మీరు మాట్లాడుతూ కూర్చోండి." అంటూ బైటికి వెళ్ళిపోయాడు అకస్మాత్తుగా.

భాస్కర్రావు సరోజనివేపు చూశాడు, నిర్ఘాంతపోయి. సరోజని కిటికీఅంచుమీద కూర్చుని "బావా! ఏమిటది—ఏమీ మాట్లాడకండా అట్లా చూస్తున్నావు?" అంది, కిలకిలా నవ్వుతూ.

భాస్కర్రావు ఇదే తరుణమనుకుని, "రాత్రి నా గదిలోకి ఎవరో వచ్చినట్టు కలగన్నాను" అన్నాడు మాటలు మింగుతూ, నట్టుతూ.

"అలాగా! పాపం? ఎవరేమిటి?" అంది సరోజని ఎగతాళిగా.

"ఎగతాళిగాదు సరో! ఉదయం లేచిచూస్తే రుజువు దొరికింది కూడాను!"

నిప్పులు గక్కుతున్న రాజకీయ నాయకు డొకడు కూడావుడిగా ఒకానొక పత్రికాఫీసులో జొరబడి సరాసరి సంపాదకుడిగదిలోకి వెళ్ళాడు.

"నన్ను దగాకోరనీ, అబద్ధాల రాయుడనీ రాసింది మీ పత్రికేనా?" అని అడిగాడు ఉగ్రమూర్తియై.

"కాదండి" తల ఎత్తకుండానే సమాధానం చెప్పాడు సంపాదకుడు.

"ఐతే ఎవరంటారు?"

"ఒకవేళ - మా పోటీ పత్రిక ఒకటుంది చూడండి - ఆపక్క బజారులో వాళ్లు వేసివుంటారు. అంత పాతబడ్డ న్యూస్ మేము ఎప్పుడూ వెయ్యం" అన్నాడు సంపాదకుడు తడుముకోకుండా.

"రుజువా? ఏమిటది"? అంది ఆమె ఆదుర్దాగా.

ఆమె రాకపోతే ఆ ఆదుర్దా ఎందుకనుకున్నాడు ఆ యువకుడు. "అవును...చామంతిపూరేకులు బైట గడపదగ్గిర పడివున్నాయి" అన్నా డతను, ఆమె కళ్ళల్లోకి చూస్తూ దొంగని వెతుకుతూ.

"అట్లాగా బావా?" విరగబడి నవ్వింది ఆ అమాయకురాలు. "అయితే ఎవరో నీ గదిదగ్గిర కొచ్చారంటావు. మంచి డిటెక్టివ్‌వే!"

భాస్కర్రావు ఏమీ మాట్లాడలేదు. "వెళ్తున్నాను సరో" అంటూ లేచాడు.

"అప్పుడేనా! కాఫీ రానీ. తాగివెళ్దువుగాని. రాత్రి నీ గదిలోకి నేనే వచ్చానని నీ అనుమానమా ఏమిటి, కొంపతీసి?...ఆఁ?"

లేచినవాడు కూర్చుంటూ, "ఎట్లా గ్రహించావు?" అని అడిగాడు భాస్కర్రావు.

"నీ ముఖవైఖరే చెబుతోందిలే బావా!" ఆమె వైఖరిలో ఏదో వింత కనిపించింది భాస్కర్రావుకి. కాని ఎందుకనో తెలియటంలేదు.

ఇంతలో కాఫీ తీసుకుని పద్మ వచ్చింది. "అయ్యో మీరు తెస్తున్నారేమండి? మా పిన్ని ఏమైంది?" అంటూ సరోజని కాఫీ అందుకుంది. ఒకగ్లాసు భాస్కర్రావు కిచ్చింది, తనొక గ్లాసు తీసుకుంది.

వాళ్ళ సంభాషణ ఇతర విషయాలమీదికి మళ్ళింది. ఎవరి మనస్సులో సందేహాలు, భయాలు, వాళ్ళమనస్సుల్లోనే వుండిపోయాయి. పైకెవ్వరూ ఏమీ అనలేదు. [ఇంకావుంది]

# వెంకప్ప మేష్టారు

పి. జి. స్వామి

చింతలూరు బోర్డు యెలిమెంటరీ స్కూలు కాంపౌండులో, పుసయం ఆరున్నర గంటలకి, అయిదు మొదలు పదేళ్లవరకూ వయస్సుగల ఆడపిల్లలూ మగపిల్లలూ సుమారు యాభైమంది చేరి ఆటలాడుకుంటున్నారు. ఆ సమయంలో గేటు తెరిచి వెంకప్ప మేష్టారు వొచ్చేరు. పిల్లల ఆటలూ పాటలూ ఆగిపోయేయి. అతడు సన్నగా పొడవుగా వుంటాడు. పూర్వపు ఫేషనులో పిలక, ముందున ఉంగరాల జుట్టు, ముందున క్రాపింగు తలాను. రాగానే, 'వొరే! గవిరేసూ, సుబ్బా! వెధవల్లారా! మొక్కలకి గొప్పుతవ్వి, నీళ్లు తోడిపొయ్యడం మానీసి గెంతుతున్నా(రా? మీరు పాడవపేమే కాకుండా తక్కిన పిల్లల్ని కూడా పాడుచేస్తున్నారు.' అని కేకేసేసరికి వాళ్లిద్దరూ వొచ్చి, 'దండాలండీ గురూ!' అంటే, 'దండాలు గురూ యేమిట్రా వెధవా! నమస్తే మేసారూ, లేకపోతే సైహిందు మేస్టారూ, అనాలి వొరే! ప్రెయరు చేసే(రా?' అని అడిగేడు. 'అన్నీ అయేయి మేస్టారూ,' అని గవిరేసంటే, 'లేదండీ గురూ! వొచ్చిన కాణ్ణుంచీ మీమీద పాటలూ ఆటలూనం అని సుబ్బడీ డన్నాడు. 'గురూ - ఆ - లేదు - మేస్టారూ! ఆ డన్నీ అబద్దాలేనండీ వొరె సుబ్బా! మరైతే స్కూలు బైటికెల్లింతరవాత,' అని గవిరేసు సుబ్బడిని భయపెట్టేడు. 'వొరే, దెబ్బలాడితే యెవికలు విరగ్గొడతాను. మీరువెళ్ళి ఫీల్డువర్కు చూడండి. లక్ష్మీ! ఆడపిల్లలందరూ క్లాసులు క్లీనుచేసి యెవళ్ల క్లాసుల్లో వాళ్లు నిశ్శబ్దంగా కూచోండి,' అని మేస్టారు చెప్పగానే మగపిల్లలందరూ బొరిగెలు పట్టుకుని వెళ్ళేరు, ఆడపిల్లలు గదులు తుడుస్తున్నారు. అప్పటికి సూర్యం మేస్టారు వొచ్చి వెంకప్పదగ్గర వొక చుట్ట పుచ్చుకున్నాడు. ఇద్దరూ చుట్టలు ముట్టించి కాల్చుకుంటూ వరాండాలో వోమూలని కూచున్నారు వెంకప్పకేదో జ్ఞాపకం వొచ్చి గవిరేసునీ మరి ముగ్గురు కుర్రాళ్ళనీ పిలిచి గోనెసంచులు పట్టుకెళ్ళి పచ్చగడ్డి తవ్వి వొక గోనెడు తనింట్లోనూ, మరోటి హెడ్మాస్టరుగారింట్లోనూ పడెయ్యమని చెప్పేడు అప్పుడు సూర్యం మేస్టరుకీ వెంకప్పకీ యీ కింది సంభాషణ జరిగింది.

సూర్యం: వెంకప్పా! నీ కెందుకురా హెడ్మాస్టరు గొడవా? వాడింట్లో బంట్రోతు తైనాతున్నాడు. వాడు స్కూలు పుృ్యనైనా యిక్కడి కోమాటైనా రాడు. స్కూలు గంటకూడా నువ్వో, యే పిల్లాడో కొడుతున్నారు.

వెంకప్ప: వొరే! నీకు తెలుసున్నగదా. నేనీవూరివాణ్ణి. యేదో ట్రైనింగైన వెంటనే యిక్కడే నవుకరీ అయింది. నేనందరిదగ్గిరా వొదిగివుండాలి లేకపోతే యేమూలకి విసిరేస్తారో అని భయం. ఆ జీతపు రాళ్ళకి తోడు భూమిన్నొచ్చిన గింజల్తో యెలాగో కాలక్షేపం జరుగుతోంది. మరో ప్రమాదం యేమిటంటే యేటేటా సంతానం పెరిగిపోతోందిరా.

సూ: అంచేతే నిన్ను గుంటలందరూ 'సూతులో కప్పా, వెంకప్పా!' అంటారు. అయినా నీకేంరా. ఇల్లుంది, భూముంది. స్వంతవూరూ. దసరా మామూళ్లన్నీ నువ్వే కొట్టేస్తున్నావు. ఇంకా వాళ్లూ వీళ్లూ యిచ్చిన గింజా గట్రా నీకే యిస్తున్నాడి.

వెం: వొరే అలాగంటే వొప్పను. నువ్వూ, ఆనందం, హెడ్మాస్టరూ యేంజేస్తున్నారూ? నువ్వు సంతకం పెట్టేసి తిన్నగా బజారువీధికెళ్లి షావుకార్లయింకంటాక్సు లెక్కలు రాసుకుంటావు. ఆనందంగాడొస్తాడు వొకగంట అటూ యిటూ తిరిగి వాడి క్లాసు నాకొప్పజెప్పేసి వాడి యిన్సురెన్సు బిజినెస్ మీద వాడు చపాయిం చేస్తాడు. హెడ్మాస్టరొచ్చి ధాం ధూమ్మంటూ అరిచి స్కూలంతా నాకొప్పజెప్పి సైకిలుమీద పట్నంపోయి డాక్యుమెంటులు రాసుకుంటాడు మీరు ముగ్గురూ కనీసం నెలకో యాభైరూపాయిలు కళ్లజూస్తారు అలాంటప్పుడు నా దసరా మామూళ్ళు, గింజా వొకలెక్కా? యెవళ్లొచ్చినా సప్లయిలు నాకే తగిలిస్తారు. వూళ్ళోవాళ్ళందరూ 'పిల్లలకి వోపూటే స్కూలేమిటి అపూటైనా చదువు చెప్పడం లేదు. ఆటలూ, పాటలూ, పొలంపాటుతప్ప మరేమీ లేదు యీ మేస్టర్లకి జీతాలివ్వడం పుత్తదండగ' అని నన్నే దుయ్యబట్టుకుంటారు.

సూ: చాల్లేరా! యేదో డివిజనాఫ్ లేబరు లేకపోతే మనబతుకెలాగరా.

అప్పుడు ఆనందరావూ, హెడ్మాస్టరు నారాయణస్వామీ వొచ్చేరు. హెడ్మాస్టరు 'వెంకప్పా! ప్రెయరూ అన్నీ అయేయా? గడ్డికెవళ్లనేనా పంపేవా? ఆ గోపాలంగాడిని పంపించి వాళ్లతోట్లోవి అరుక్కొబ్బరికాయ లింటికిచ్చిమను ఒరే ఆనందూ! రెండోషిప్టుకి నువ్వుండాలిసుమా. సూర్యం కూడా వుంటాడు. వెంకప్పా! సరే పైప్రైజా కానివొస్తే గప్పుని సైకిలిచ్చి వెంకన్నని పంపించు' అని చెప్పేడు వెంకప్ప 'సరేలే. యేదో చూస్తాను. నువ్వొచ్చేటప్పుడు వొక గ్లాక్సో డబ్బా తేరా' అన్నాడు 'డబ్బురా' అని నారాయణస్వామి అంటే, 'యేదో చూ(డా' అని వెంకప్పన్నాడు. సరేనని హెడ్మాస్టరన్ని క్లాసుల్లోకీ వోమారు వెళ్లి,

# ★ వెంకప్ప మేష్టారు ★

నల్లబల్లలమీద హాజరురాయించి సైకిలుమీద పట్నం వెళ్లేకు అతడు వెళ్లిన అరగంటకి ఆనందరావూ వెళ్లేడు.

వెంకప్పా, సూర్యమూ కూచుని బాతా కానీ చేస్తున్నారు. కొంతసేపయింతరవాత వొకాయన చుట్ట కాల్చుకుంటూ దూరాన్ని రావడంచూసి వెంకప్ప 'వొస్తున్నాడ్రా బాబూ. చేతిలో కాయితాలకట్టకూడా వుంది. ఇక పన్నెండుగంటలవరకూ తిండికేనా వెళ్లనివ్వడు' అన్నాడు. సూర్యం 'ఎవడ్రా? ఏమిటిజేస్తాడూ' అన్నాడు. వెంకప్ప 'యెవ డేమిటి, భీమంధొర. ఆ కాయితం, యీకాయితం అని జిడ్డులాగ పట్టుకుని రాయిస్తాడు' అన్నాడు. యేమైనా యిస్తాడా అని సూర్యమడిగితే 'వాడిబొంద యిస్తాడు. కాళ్లరిగిపోయేటట్టు తిరిగితే యేడాదికో నాలుగుమణుగులు చింతపండి స్తాడు' అని వెంకప్ప చెప్పేడు. 'అయితే వాడిదగ్గిర నీకెందు కొభయం' అని సూర్య మడిగేడు. వెంకప్ప వాడు మన ప్రెసిడెంటుకి మదుపుపెట్టి యలక్షనులో నెగ్గేటట్టుచేసేడు. వాడేంచెప్పినా బోర్డులో సాగుతుం దన్నాడు. 'సరే వాడూ నువ్వూ యేదో యేడవండి. నేను కొంతసేపీ మేకల్ని కాసి వెళ్తాను రేపు శనివారం కమర్షియల్ టాక్సాఫీసరు వొస్తాడు. రేపు సాయంకాలానికి రామ్మూర్తిసెట్టినీ, రమణయ్యనీ, అప్పారావునీ వాళ్ల యెకౌంట్లతో హాజరవమని నోటీసిచ్చేడు అవన్నీ రేపు సాయంకాలంవరకూ కూచుని సర్ది రాయాలి' అని చెప్పి వెళ్లేడు. భీమంధొర వొచ్చి వెంకప్ప చేత యేవో కాయితాలు రాయించుకుని పదికి వెళ్లేడు.

మరో అయిదునిమిషాలకి గవిరేసు పరుగెత్తివొచ్చి 'గురూ! సైకిలుమీద యెవురో టోపీ యెట్టుకుని వొస్తున్నార'న్నాడు. సరేనని వెంకప్ప తన టేబిల్లోవున్న నల్ల కోటు తొడుక్కుని పాగా పెట్టుకుని పిల్లల్ని 'సైలెన్సని పెద్దకేకవేసి వరండాలో నిలబడ్డాడు. అప్పటికి జూనియరు యిన్స్పెక్టరుగారొచ్చేరు ఆయన్నాహ్వానించి కూచోబెట్టి గంభీరంగా 'విజిటింగు బుక్కు తేవాలా సార్? క్లాసులేనైనా చూస్తారా' అని వెంకప్పడిగేడు.

జూనియరు: యేమీ వొద్దయ్యా హాజరు చాలా తక్కువ వుందేమిటీ? ఫస్టు షిఫ్టు యెంతమందీ?

వెంకప్ప: నూటాయాభై పెద్దక్లాసుల వాళ్లు ఫీల్డువర్కుకి వెళ్లేరు

జూ. మీ హెడ్మాష్టరూ, మిగిలిన యిద్దరు టీచర్లూ యేరీ?

వెం: డి ఈ ఓ. గారి దగ్గిర్నుంచి యేదో వొచ్చింది, వెంటనే రమ్మని సినియరుగారు కబురుచేస్తే హెడ్మాష్టరుగారు పట్నంవెళ్లేరు. సూర్యారావుగారు యింతవరకూ అయిదోక్లాసు లెక్కలు టీచింగు చేసి ఫీల్డువర్కు సూపర్వైజనుకి వెళ్లేరు ఆనందరావుగారింట్లో యేదో తొందర పనుందని యిప్పుడే వెళ్లేరు

జూ సరే. టైమెంతైంది?

వెం: పదిన్నర. లాంగుబెల్లు టైమయింది.

జూ: నేను సైకిలుమీద లచ్చిరాజుపాలెం వెళ్ళాలి. యెండ తీవ్రంగావుంది.

వెం: శెలవైతే మీల్సు యేరేంజి చేయిస్తాను తమరు యిక్కణ్నించి మధ్యాహ్నం మూడుగంటలకి కాఫీ తీసుకుని వెళితే మంచిది.

జూ: మీ కెందుకండీ శ్రమా.

వెం: శ్రమేమిటీ? తమవంటివారికి మాత్రం సదుపాయం చెయ్యకపోతే మేమెందుకండీ యిక్కడా?

వొక పిల్లవాడిచేత నాలుగు నీళ్ల కొబ్బరికాయలు వెంటనే తెప్పించియిస్తే జూనియరుగారు రెండుకాయల నీళ్లు తాగి మిగిలిన రెండూ సంచిలో వేసేరు మరి అరగంటకి భోజనంకూడా తెప్పించితే భోంచేసి, విశ్రమించి, మూడుగంటలకి కాఫీ టిఫినూ అయిం తరవాత విజిటు బుక్కులో స్కూలువర్కు సక్రమంగా జరుగుతున్నటు వ్రాసి జూనియరుగారు వెళ్ళేరు సాయంకాలం నాలుగున్నరకి స్కూలు మూసి వెంకప్ప యింటికెళ్లేడు

మర్నాడు స్కూల్లో హెడ్మాష్టరు వెంకప్పతో 'వొరే వొచ్చే నెల్లో శ్లేష్టిపలూ, మరుచటినెల్లో స్కూలు యీన్యువలిన స్పెక్షను సీనియరుగారు చెప్పేరు పిల్లల్ని యెలాగ తయారుచేస్తావో నీదే పూచీ' అని వెంకప్ప 'సరే నిన్న జూనియరొస్తే ఆయన్ని పంపించి సరికి నా తలప్రాణం తోక్కొచ్చింది.' అన్నాడు. హెడ్మాష్టరు 'విజిటు బుక్కులో బాగా రాసేడే ఏంజేసేవుం?' అంటే 'నాలుగు కొబ్బరికాయ లభిషేకం, అన్నభోగం, కాఫీ, టిఫినూ కైంకర్యంతో పంపించేను. కాని యెంతకాలం యిలా నడుస్తుందీ?' అని వెంకప్పన్నాడు. 'నడిచినంత కాలంరా నేం జెప్పినట్టూ చేద్దూ.

మరేం భయంలేదు' అని హెడ్మాస్టరు చెప్పేడు.

స్పేషల్ వైస్టివలుకి పిల్లల్ని తయారు చెయ్యడానికి పట్నంలోని హైస్కూలు డ్రిల్లు మేస్టర్ని ప్రతీ శని, ఆదివారాలు తీసుకొచ్చి అతనికి కావలసిన సదుపాయాలన్నీ చేసి, నాలుగు టీములు మగపిల్లల్నీ, రెండు టీము లాడపిల్లల్నీ తయారు చేయించేడు వెంకప్ప. యాన్యువల్ ఇనస్పెక్షనుకి అందరు టీచర్లూ కలిసి స్కూలు గోడలన్నీ నీతి వాక్యాలతోనూ, భూగోళ పటాలతోనూ, డ్రాయింగులతోను అలంకరించేరు. పిల్లల చేత నత్తగుల్లలూ, గవ్వ రాళ్ళూ, చేప యెముకలూ, బంగార పిచ్చిక గూళ్లూ వగైరాలు తెప్పించి వొక చిన్న మ్యూజియం తయారు చేయించేరు. కాంపౌండులో జాగ్రఫీ మోడల్సు (కొండలూ, నదులూ etc) వేయించేరు సీనియరుగారు శేషాస్త్రి రనగా వొక చిన్న గదిలో ఆయనకి కావలసిన సప్లైలన్నీ జాగ్రత చేసేరు.

మర్నాడు వుదయం ఆరు గంటలకి సీనియరు గారూ, ప్యూను వెంకటస్వామీ వో జట్కా మీద దిగేరు. వెంకప్ప వాళ్లి సాహ్వానించేడు. జట్కా అద్దె యిచ్చి, ప్యూనుకి టిఫిను కర్చు రూపాయిచ్చి పంపించేడు. సీనియరు గారికి అభ్యంగనస్నానానికి వొక సెంటెడు హేరాయిలు యిచ్చి అన్నీ తయారు చేయించేడు. వారి స్నానం వగైరా అన్నీ అయీసరికి హెడ్మాస్టరు టిఫిన్లూ, కాఫీ, పట్టించుకుని వొచ్చేడు అవన్నీ సేవించి, సూటు వేసుకుని ఆఫీసరుగారు రెడీ అయీసరికి ప్యూనుకూడా డవాలీ, పాగాతో హాజరయేడు. స్కూలు బెల్లు కొట్టగానే మొదటి షిఫ్టు పిల్లలందరూ జండా కెదురుగా క్లాసులవారీగా నిలబడి ప్రార్థనా, జనగణమనా అయిం తరవాత క్లాసుల్లోకి వెళ్ళేరు

అతరవాత యినస్పెక్టరు గారు తన కిచ్చిన రూములో కూచుని సిగరెట్టు కాలుస్తూ 'వెంకటసామీ! హెడ్మాస్టరుగార్ని డిగి మన కరస్పాండెన్సంతా వో కవరులో పెట్టించి తీసుకునిరా. ఇనస్పెక్ష నారంభించుతాను' అని కేకేసేరు. ఆ సంగతి వెంకటస్వామి హెడ్మాస్టరుతో చెబితే ఆయన తక్కిన మేష్టర్లందర్నీ పిలిపించి చెప్పేడు. అందులో ఆనందరావు కొత్తగా వొచ్చేడు. అతడు, 'కాన్సెన్సు! అదేమిట్రా నే నొప్పను'అన్నాడు. వెంకప్ప 'నాన్సెన్సూ లేదు, గీన్సెన్సూ లేదు దేముడంతటి వాడికి ముడుపులు చెల్లించకపోతే మనపాప పరిహారం కాదు సరికదా, మీదుమిక్కిలి. ఆపదలు తెచ్చిపెడతాగు అలాటప్పుడు మానవమాత్రు లూరుకుంటారట్రా. నలుగురితో నారాయణ' అని వొప్పించేడు.

ఒక అఫీషియల్ కవరులో అవన్నీ పెట్టించి, ఆఫీసరుగారి కోటు జేబులో జాగ్రతపెట్టి ఆ సంగతి వెంకటసామి చెప్పగానే యినస్పెక్ష నారంభమైంది. ఇనస్పెక్షను రెండు రోజులైంది. తొలినాడు సీనియరుగారికి హెడ్మాస్టరుగారింట్లో ఇష్ట పదార్థాలతో భోజనం, కావలసిన టిఫినులూ, కాఫీ, యేర్పాటు జరిగింది. మర్నాడు జూనియరుగారుకూడా ఒచ్చేరు. వారిద్దరికీ ఆరోజున పైవిధంగానే వెంకప్ప యింట్లో విందు జరిగింది. ఇనస్పెక్షను స్ట్రిక్టుగా జరిగింది. ఎక్స్ట్రా కరిక్యులరు యాక్టివిటీసు చూసేరు. బేసిక్ క్రాఫ్టులు వ్యవసాయమూ, నూలు వడకటాను. కొసవర్కు జూనియరుగారు చూసేరు. టీచింగంతా క్రాఫ్టుమీదే బేసైవుంది. నాలుగో క్లాసులో దేశచరిత్ర వెంకప్ప మేస్టారు చెప్తున్నారు. జూనియరుగారొచ్చి యినస్పెక్షను చేస్తూ విక్రమాదిత్యు డెవర్ని ఓడించేడని అడిగేరు. కొందరు పిల్లలు మహమ్మదు గోరీ అనీ, కొందరు డూప్లే అనీ చెప్పేరు. 'సరిగా చెప్పండి' అని వెంకప్పన్నాడు. అప్పుడో ఆడపిల్ల లేచి శతృఘ్ణి వోడించేడని చెప్పింది. సరైన జవాబు యెవరూ చెప్పలేదు. 'మన జాతీయగీతం యెవ రాసేరని అడిగేరు. వెంకప్ప మేస్టారని పిల్లలు జవాబిచ్చేరు ఈవిధంగా యినస్పెక్షను జరిగింది. ఇద్దరాఫీసర్లూ వెళ్లేటప్పుడు పేరెంట్సు పొలాలనించి కూరగాయలూ, తోటల్నించి రెండు డజన్లు కొబ్బరికాయలూ, యితర త్రా రెండు చెంబులు మంచి నెయ్యీ, రెండు మూటలు సన్న బియ్యమూ, వారి జట్కాలలో వేయించి, యిద్దరు ప్యూన్లకీ చెరో రూపాయీ, యినస్పెక్షను మామూలిచ్చి వాళ్లని సాగనంపేరు.

ఇనస్పెక్షను రిపోర్టులో అంతా బాగున్నట్టు రాసేరు కాని హిస్టరీ, జాగ్రఫీ, సివిక్సూ యింకా బాగా వుండాలన్నారు. ఆ సబ్జక్టులు వెంకప్పవి. అది చూసి,

వెంకప్ప : వొరే మీరందరూ స్కూలుకి మొహం చూపెట్టేసి వెళ్తారు. గోడదగ్గిర నక్కలాగ యీ గుంట వెధవల్తో రోజల్లా నేను చస్తున్నాను. వొచ్చిపోయీ వాళ్ళతో మీగురించి తెల్లవారితే లత్కుబద్ధాలాడ్డం, వాళ్ళ సప్లైలు చూడ్డం, పేరెంట్సు తిట్టే తిట్లుతినడం, తుదకి బ్లాకుమార్కు నావొంతూ, పువ్వుల రంగళ్ళలాగ తిరుగుతారు మంచి రిమార్కు మీ వొంతూనా? హెడ్మాస్టరన్నావు నువ్వ చెప్పలేక పోయేవూ?



గ్రద్దల జంట

—ఫొటో: కె. నాగలింగేశ్వరరావు



హెడ్మాస్టరు. యేమిట్రా మహా మాట్లాడుతున్నావూ? గాదికింద పందికొక్కులాగ తింటున్నావు. నిజానికి మేం ముగ్గురం మూళ్ళల్లో వొగంటవుంటే నువ్వు మూడు రోజుల్లో చేసినంత పని చేసుకుపోతాం. బ్లాకుమార్కొంచిందంటే నాదా తప్పూ? నీ కంత కష్టమైతే శెలవు పెట్టూ రిలీవు చేస్తాను.

వెం: ఇదా నువ్వుచేసే వుపకారం?

హె. నువ్వనేస్తే సరా ఎన్నిమాట్లు నీకు ట్రాన్స్ఫరు కాకుండా చేసేనో నీకేం తెల్సు. సీనియరుకి నీమీద మంచి వొపీనియను లేదు. అప్పటికి నేను సర్ది చెబుతూ వుంటే నిన్నింకా యిక్కడుంచేరు.

వెం: మహోపకారం చేస్తున్నావు. శెలవు పెడతాను. నూక్కెలా వడుస్తుందో నువ్వే చూస్తావు.

హె: పెట్టవోయ్. కోడీ కుంపటీ దాచేస్తే వూళ్ళో తెల్లవారదన్న ముసిలమ్మ లాగ చెబుతున్నావు కబుర్లూ. శెలవట్టి పెట్టూ.

వెం: పెడతానా, పెట్టిచూస్తానా నాకూ వొంట్లో బాగులేదూ.

అని విసురుగా వెంకప్ప వెళ్లి వూళ్లో యలయ్యం డాక్టరు దగ్గిర మూడు నెల్లు మెడికలు లీవుకి సర్టిఫికటుతో సహా అర్జీ పెట్టేడు, పదిహేను రోజులైంది. శెలవార్డరు రాలేదు. బోర్డాఫీసు కెళ్లి కనుక్కుంటే కన్నద క్లార్కు పదిరోజులు కాజువల్ లీవు పెట్టేడన్నారు. అప్పుడు వెళ్తే సర్వీసు బుక్కు రావాలన్నారు. మరి పదిరోజులు తరవాత వెళ్లి అడిగితే బోర్డాఫీసాడిట్టు జరుగుతున్నదనిన్నీ, మరి యిరవైరోజులవరకూ ఏపనీ చెయ్యడానికి తీరుబాటులేదనిన్నీ చెప్పేరు. ఆలాగే వెళ్లేడు. క్లార్కు వొమూల నిం సర్వీసు రిజిష్టర్ల కట్ట వొకటి తలకింద పెట్టుకుని నిద్రపోతున్నాడు. అతడు లేచినతరవాత 'మీ దరిసెనానికే వొచ్చేనని' అతి వినయంగా చెప్పేడు వెంకప్ప. క్లార్కు అతి కోపంగా 'వుద్ధరించేవు చాలా సంతోషించేం. చూస్తాం వెళ్లు. నీ ఫైలు డి. బి. యీ, ఓ. గారి దగ్గిరుంది. అక్కణ్ణించి రానీ. ఆర్డర్లు పంపుతాం. అయినా పిడికుచ్చులాగున్నావు నీకా మెడికల్లీవూ? వెళ్ళూ' అని కసిరి వెళ్లగొట్టేడు. దేముడా అని తిరిగివొచ్చి మర్నాడు భీమంధొరతో జరిగిన సంగతంతా చెప్పుకున్నాడు. శెలవు పెట్టి సుమారు రెండు మాసాలైంది. ఆర్డరు రాందీ జీతాలు ముట్టవు. నానా యిబ్బందీ పడుతున్నాడు. హెడ్మాస్టరెన్నిసార్లు రాసినా ఫికర్లేదు. ప్రెసిడెంటుగారు వూళ్లో లేరని తెలిసి, పదిరోజులైంతరవాత భీమంధొరా, వెంకప్పా, ప్రెసిడెంటుగారి దర్శనం చేసేరు. సంగతంతా విని ఆ మర్నాడు పన్నెండు గంటలకి ఆఫీసుకి రమ్మన్నారు. ఆలాగే మర్నాడు ఉఫేదారుని మంచిచేసుకుని ప్రెసిడెంటుగారి



ఊరిమడుగు

—ఫొటో: లంక సూర్యనారాయణ

యెగుటపడ్డాడు. కన్సరడ్డు క్లార్కుని పిలిపించితే వో కొత్తాయన వొచ్చేడు 'యేమయ్యా! వెంకప్ప అనే టీచరు చింతలూరు యెలిమెంటరీ స్కూలునించి రెండు నెల్లకిందట శెలవు పెట్టేడట ఆ ఫైలూ, సర్వీసు రిజిస్టరూ తెండీ' అని ప్రెసిడెంటు గారు పంపించేరు మరి పావుగంటకి అవన్నీ పట్టుకుని క్లార్కు హాజరయేడు. ఫైలుచూస్తే ఆర్డర్సు ఫర్వ్రావలని వొక డ్రాఫ్టుంది. అందులో వెంకప్ప శెలవుమాట లేదు సరికదా మరో టీచర్ని అతని స్థానే పెర్మనెంటుగా వేసేరు ఆ ఆర్డరెవరు డ్రాఫ్టుచేసేరని అడిగితే డి బి యీ వో గారని క్లార్కు చెప్పేడు. సర్వీసు రిజిస్టరు చూస్తే ఆఖరు యెంట్రీ 'యెప్లయిడు ఫర్సిక్లీవు సిన్సు డిసీజ్డని' వుంది. 'ఇదేమిటయ్యా యీ రిమార్కు? మనిషి బతికుంటే డిసీజ్డంటా వేమిటి? అని ప్రెసిడెంటుగారన్నారు 'చిత్రం. యీ సీటు నేను వారం రోజులై చూస్తున్నానండీ ఆ యెంట్రీ నా ప్రిడిసిసరుగారు రాసేరండీ. నేనడిగితే 'జబ్బుతో వున్నాడు కదయ్యా' 'డిసీజంటే రోగం. అంచేతలాగ రాసేనన్నారు' అని క్లార్కు జవాబిచ్చేడు 'యేడిసినట్టేవుంది నీ చదువూ, వాడి చదువూనూ డిసీజ్డంటే చచ్చేడన్నమాట. నువ్వన్నది *Disease*, అంటే జబ్బు, యిది *Decease* అంటే చావు. మీరు యీ రిమార్కు రాస్తే డి. బి యీ వోగారేం జేస్తారూ? ఆయెంట్రీ కొట్టేసి, మూడు నెల్లు మెడికల్లీవు గ్రాంటు చేసి ఆర్డరుమీద డి బి యీ. వో గారి సంతకం పెట్టించి, వెంటనే డిస్పాచి చేయించండి' అని క్లార్కుని ప్రెసిడెంటుగారు పంపించేరు. వారివద్ద శెలవు తీసుకుని వెంకప్ప యింటికొచ్చేడు. శెలవార్డర్లు వొచ్చి సరికి శెల వంతమై పోవొచ్చింది హెడ్మాస్టరుచేత బిల్లు చేయించి, అవి భీమున్ధొర చేతికిచ్చి ప్యాసు చేయించమనీ, శెలవాఖర్ని మళ్లా ఆ వూరిలోనే వేయించమనీ వెంకప్ప చెప్పుకున్నాడు అత డలాగేచేసి, డెక్కు తెచ్చి వెంకప్పకిచ్చి, మళ్లీ ఆ వూళ్ళోనే వేసినట్టు ఆర్డరు ఆఫీసుకాపీ సంతకమైందనీ, టైపు చేయించి పంపుతారనీ చెప్పేడు.

శెలవైపోయింది ఆర్డర్లింతకీ రావు. వెంకప్ప నాలుగైగుసార్లు బోర్డాఫీసుకి వెళ్లేడు. క్లార్కుని అడిగితే యిదుగో పంపుతామని చెప్పేవాడు ఈ క్లార్కు మరొకడు చాలా యెక్స్పీరియన్సు గలవాడు. వెంకప్ప మరోనాడు సూపరెంటుగార్ని అడిగితే ఆయన వొక్క కసురుకసిరి, 'నీకు స్కూలూ, పనీ లేదూ? యెప్పుడూ బోర్డాఫీసులోనే దేవులాడుతున్నావు' అన్నాడు 'చిత్రం నే నిప్పుడు త్రిశంకు స్వర్గంలో వున్నానండి నాశెలవైపోయింది. యెక్కడ జాయినయేదీ తెలీక ఆర్డర్లకోసం యింగా తిరుగుతున్నానండి' అని వెంకప్ప చెప్పేడు. 'వెళ్ళూ ఆర్డర్లు పుడితే రాకేం జేస్తాయ్. ఈసారి కానీ నువ్వు మళ్ళా

# ★ వెంకప్ప మేష్టారు ★

యిక్కడ కనుపించేవంటే నీకు సస్పెన్షను తప్పదు. వెళ్లు' అని సూపరెంటు చెప్పేడు. వెంకప్పయింటికొచ్చి హెడ్మాస్టరుతో జరిగిన సంగతంతా చెప్పి 'నారాయణస్వామీ! నీకూ సూపరెంటుకీ స్నేహంకదరా. నువ్వతనితో చెప్పరా బాబూ' అని బతిమాలుకున్నాడు. హెడ్మాస్టరు 'వోరే! సూపరెంటేంజేస్తాడు, ప్రెసిడెంటేంజేస్తాడూ? ఇప్పడాసీట్లోవున్న క్లార్కు పాతపిల్లి. వాడి నోకంట జూస్తివా నీ ఆర్డరు నీచేతి కొస్తుంది. రేపు వుదయం నువ్వెళ్లి అతగాడిని యింటిదగ్గర చూడు. ఆ లౌక్యం నీతో చెప్పాలా' అని సలహా యిచ్చేడు. మర్నాడు వో సంచీలో కూరగాయలూ, వో సీసాలో మంచినెయ్యీ పట్టుకుని ఆ గుమాస్తా యిల్లు వెతుక్కుంటూ వుదయం యెనిమిదిగంటలకి వెంకప్ప అక్కడ హాజరయేడు. కొంతసేపటికి ఆయన బజారునుంచి వో సంచీతో సామాను పట్టుకుని వొచ్చేడు. వెంకప్పవేపు చురచురా చూసి, యింట్లో ఆ సంచీ పడేసి, బయటకొచ్చి 'యేమిటయ్యా! యింటిదగ్గిర కూడా దాపరించేవు కని చుక్కలాగా? నాకు మరేపనీ లేదనుకున్నావా? వెళ్లు' అని గట్టిగా అరిచేడు. వెంకప్ప 'అలా కలవియ్యకండీ ప్రెసిడెంటుగారు నా ఆర్డరు ఆఫీసు కాపీమీద యిరవైరోజులకిందటే సంతకం చేసేరట' అంటూవుంటే మరి మాటాడనియ్యకుండా అందుకుని, 'ప్రెసిడెంటు సొమ్మేంబోయిందీ. యిష్ట మొచ్చినట్టూ ఆర్డర్లు వేస్తాడు. నీ కాన్ఫిడెన్షల్సు చూసీ సీనియర్ డిప్యూటీని కన్సల్టు చేసేడా? అవి డిప్యూటీకి పంపాలని సూపరెంటు చెప్పేడు. నీ కాయితాలు సూపరెంటు టేబిలుమీదున్నాయి. అవి వెళ్ళాలి, తిరిగి రావాలి. అప్పుడవసరమైతే రివైజ్డు ఆర్డర్లు పుట్టాలి. పైపయి, ఫెయిరు కాపీలు సంతకాలైతే నే నే కాని డిస్పాచికి వెళ్లవు. అక్కడెన్నాళ్లుంటుతారో నీ అదృష్టం' అని క్లార్కన్నాడు. వెంకప్ప తన సంచీలోంచి కూరగాయలూ, నేతి సీసా తీసి ఆయన యెదట పెట్టి, వో కవరు చేతిలో పెట్టేడు. ఆ కవరు లోపలి కంటెంట్సు చూసుకుని నెయ్యివాసన చూసి, అతి సింపతిటిక్కుగా 'అది కాదండీ నేనసేదీ. ద్యూకోర్సులో మీ కార్డర్లు వొస్తాయికదా, మీ రిన్నిసార్లు తిరగడం యెందుకంటా. కనీసం పదిసార్లైనా వొచ్చేరా, ట్రిప్పుకి రెండు రూపాయిలైనా అవుతాయా, ఏం సర్వీ నియోగం అయినట్టూ? మనం పిల్లలవాళ్లం. యిలాగ డబ్బు దండుగజేస్తే యెలాగ? సరే. మీ కలవు యే తేదీతో అయిపోయిందీ?' అని క్లార్కడిగేడు. పదిహేనురోజులైందంటే 'సరే నే నవన్నీ చూసుకుంటాను. మీ బసెక్కడా ఆర్డర్లు పైపు చేయించి తెచ్చి మీచేతికి సాయంకాలం ఆరుగంటల కిచ్చేస్తాను' అని క్లార్కు చెప్పేడు. వెంకప్ప 'మీ కెందుకా శ్రమా ఎన్ని గంటలకి రమ్మని కలపైతే అన్ని గంటలకి ఆఫీసుకొస్తాను' అన్నాడు. 'ఆ పనిమాత్రం వొద్దు. సెక్రటరీ, సూపరెంటూ మంచివాళ్లు కారు. నే తెచ్చియిస్తాను' అని క్లార్కు చెప్పేడు. కలనైపోయిన దగ్గిర్నుంచీ కాళీగావున్న రోజుల మాట వెంకప్పడిగేడు. అన్నీ చూసుకుంటానని క్లార్కు చెప్పి, వెంకప్ప యెడ్రసు నోటుచేసుకున్నాడు.

ఆ సాయంకాలం వెంకప్ప బసకే ఆర్డర్లు తెచ్చి క్లార్కుగా రిచ్చేరు. అందులో ఆర్డర్సు టుబీ కెఫెక్టు ఫ్రం ది డేటాఫ్ ఎక్స్పైరీ ఆఫ్ లీవు' అని కూడా వేయించేరు. మర్నాడవి హెడ్మాస్టరుచేతి కిస్తే అతడు 'చూసేవా! యెంత నాసుబాపైనా నాగస్వరం వూదితే కట్టడిపోతుందిరా' అన్నాడు. ఎంత సీకలమీద కొచ్చినా తన సర్వీసులో మళ్ళీ వెంకప్ప కలవు పెట్టలేదు.



# కోరిన వరుడు

### వాకాటి పాండురంగరావు

"ఏమిటే అది? అదేమో దానికి కష్టం వచ్చినట్లల్లా వాగుతుంటే నీవూ దాంతోబాటు దూకుతున్నావ్! అతగాడు ఇపుడు ఎక్కడున్నాడో, ఏమో? చేతిలో వెన్న వుంచుకుని నేతికోసం వూరంతా తిరిగినటవుతుంది మన కథ. అందుకనే మునుపు యుక్తవయసు రాగానే ఎవడికో కట్టబెట్టేసేవారు. ఈ కాలంలో వీళ్ళు బి ఏ లూ, బి ఎస్ సి లూ చదవడమూ చాలు, నాలుగు తండ్రులు తిరగలేక అవస్థ పడడమూ చాలు" అని తమ బాధనంతా వెళ్ళబుచ్చారు రాఘవయ్యగారు.

నాలుగు రోజులనుండీ ఇంటో ఒక్కటే రగడ. కారణం - కుమారి లీల బి ఎస్ సి.! రాఘవయ్యగారి ముద్దు కొమరిత; బంగారు బొమ్మ. లీల బి ఎస్ సి పూర్తిచేసినపుడే, ఆమె మేనత్తకొడుకు రామం ఎంజినీరింగ్ పాసయ్యాడు. జాతకాలు జతగా, జాగ్రత్తతో పరిశీలింపబడినై "ఆహా! అద్భుతమైన పొందిక!" అన్నారు జోస్యులు. రాఘవయ్యగారు పెళ్ళి బడ్జెట్ వేయడంలో మునిగిపోయారు.

అప్పుడనగా అప్పుడు, ఆయన సతీమణి పరుగెత్తుకొచ్చి "ఏమండోయ్! దాని మాట విన్నారా? రామాన్ని పెళ్లాడదట. రెండేళ్ల క్రితం మన పక్కింట్లో సబ్ - జడ్జీగా రుండేవారే - ఆయన అబ్బాయి చంద్రశేఖరం తెలీదూ? అతణ్ణి తప్ప మరొకణ్ణి పెళ్ళాడదట మన లీల" అంది

"భేష్! బలే బాగుంది. నిశ్చితార్థం రోజున చెప్పకుండా నీ కూతురు ముందు జాగ్రత్తతో ఇప్పుడే చెప్పింది. చాల తెలివి గలదిలే! ఆ అబ్బాయీ వాళ్లూ ఇపుడెక్కడున్నారో? అతడేం చేస్తున్నాడో? ఏం? మన రామానికి ఏం తగ్గిందట? అందంలేదా? చదువులేదా? ఆస్తికేం తక్కువా? ఒహవేళ ఆ అబ్బాయి చంద్రశేఖరానికి ఈపాటికే పెళ్ళయివుంటే ఏంచేస్తుందట ఈ బుద్ధిమంతురాలు? వెధవ చెత్తపుస్తకాలు చదవడమూ దరిద్రపు సినిమాలు చూడడమూ; - వీటి ఫలితమే ఈ ప్రేమా పెటాకులూను" అని విసుక్కున్నారు రాఘవయ్యగారు.

నాలుగు రోజులనుండీ ఇలాగే రామరావణ యుద్ధం జరుగుతోంది ఇంట్లో. లీల ఈ కాలపు యువతి; అందులోనూ బి. ఎస్ సి! పట్టుదలా, మొండివాదనా లేకుండా వుంటుందా? స్త్రీలకనే భగవంతుడు ప్రత్యేకంగా సృష్టించిన 'కన్నీర'నే ద్రవపదార్థం ధారావాహినిగా దొరలిపారింది. ఈ ప్రవాహవేగానికి తట్టుకోగల పాషాణహృదయం, అందులోనూ తండ్రి మనసూ వుంటుందా?

"నీకు మేలుచేయాలనే మావుద్దేశం. ఆ తర్వాత నీ ఇష్టం" అని రాఘవయ్యగారు సబ్ జడ్జీగారికోసం దేశమంతా గాలించారు. ఆయన అడ్రసు కనిపెట్టడానికి నాలుగు పెళ్లిళ్ల ప్రయత్నం కావలసి వచ్చింది. కడపట ఆయన నాగపూరులో కలెక్టరుగా వున్నాడని, ఆయన కుమారుడు చంద్రశేఖరం ఎం. ఏ పాసయి ఢిల్లీ సెక్రటేరియట్‌లో 'అసిస్టెంటు సెక్రటరీ'గా వుంటున్నాడని, అతనికింకా వివాహమవలేదనీ తెలిసింది. రాఘవయ్యకు పోయిన ప్రాణం వచ్చినట్లయింది.

వెంటనే సబ్ జడ్జిగారికి తమ అమ్మాయి ఫోటోనూ, జాతకాన్నీ పంపిస్తూ, అన్నీ సరిపోతే మాఘ మాసంలో ముహూర్తం పెట్టుకుందామని సూచిస్తూ ఒక లేఖ వ్రాశారు. వారంరోజులు తిరక్కముందే తమ కందరికీ ఏలాటి అభ్యంతరమూ లేదనీ, లీలను తామందరమూ ఎరుగుదుము కనుక పిల్లను చూడడంలాటి లాంఛనాలు అనవసరమనీ, పెళ్లి ప్రయత్నాలు జరుపమనీ - తెలుపుతూ జవాబొచ్చింది.

లీల బి ఎస్ సి, హృదయం హైడ్రోజన్ బెలూన్‌లా ఎగిరింది. ఎప్పుడో నాల్గేళ్ళ క్రితం అన్నయ్య కామేశంతోబాటు కలిసి తీయించుకున్న ఫోటోలోని చంద్రశేఖరాన్ని చూసి మురిసిపోయిందిలీల. ఆ స్వన్నటి గ్లాస్గోలాల్చీ, మల్లెపూవులాంటి ధోవతి, చిన్న అబ్బాయిలా వున్న మొహం, తన్ను గిలిగింతలు పెడుతున్న చిరునవ్వు. ఆ శేఖరం ఇంకా అవివాహితుడుగావుండడం తన అదృష్టం కాకపోతే మరేమిటి? బావ రామం అందగాడే కానీ - తని మొహంలో చంద్రుని యొక్క కళా, తీరూ లేవే? రామాన్ని పెళ్ళాడనన్నందున మేనత్త తోకతొక్కిన తాచులా తిరుగుతోంది. గమనించనట్లు నటించింది లీల

ముహూర్తానికి ముందురోజు వుదయం. వియ్యాలవారందరూ 'ఎక్స్‌ప్రెస్'లో దిగారు. అందరికీ రాజోపచారాలు జరిగాయి. సాయంత్రం విమానంలో పెళ్ళికొడుకు వచ్చాడు. రాఘవయ్యగారూ, ఆయన కొడుకు కామేశమూ, మేనల్లుడు రామమూ - వెళ్ళి శేఖరానికి స్వాగతమిచ్చి ఆయనకు విడిదిలో బస ఏర్పరచారు. విమానాశ్రయానికి లీల పోవడానికి వాళ్లమ్మ అంగీకరించలేదు. అదీకాక ఆయనకు తాను కనపడకుండావుండి 'సస్పెన్సు' సృష్టించి, హఠాత్తుగా ముహూర్తపువేళకు కన్పడి 'క్లయిమాక్సు' తీసుకురావాలని వూరుకుంది లీల బి ఎస్ సి.

పెళ్లిరోజు, ముహూర్తపు వేళ. పీటమీద పెళ్ళికొడుకు కూర్చుని వున్నాడు. అలంకారాలబరువుచేత వంగిన మెడతో, భారత స్త్రీలకే సహజమైన సిగ్గు ఒక క్షణంసేపు తన్నావరించగా, లీల వంచిన తల యెత్తక వచ్చి పీటలమీద కూర్చుంది. కొంతసేపటికి లజ్జాభారం సడలింది. తలెత్తి ఓరకంటితో చూచింది చంద్రశేఖరాన్ని.

"ఆ...అయ్యయో! ఇదేమిటి? తన హృదయంలో పూజిస్తుండిన ఆ శేఖరం ఏడీ? ట్వీడ్ సూట్‌లో చిక్కుకుని అవస్థ పడు

# ★ కోరిన వరుడు ★

తున్న ఈ శేఖరం ఫోటోలోని తన అందాల రాజు శేఖరమేనా? ఏనుగులా వున్నాయి కాళ్ళు చేతులూ! బుగ్గలు వేలాడుతున్నాయి! మెడ అసల్లేదు!"......లీల ఏదో చెప్పరాని వేదనతో తల్లడిల్లింది. ఇందుకేనా తాను మొండిపట్టు పట్టింది? అసలు 'సన్న'లంటే లీల పరిహాసాలాడేది. చంద్రశేఖరానికి లీల మనస్సాగరంలోని తుఫానెలా తెలుస్తుంది? అతడు తేనె తాగిన తుమ్మెదలా ఆనందపారవశ్యంలో వున్నాడు అతి ఉత్సాహంతో శేఖరం ఇలా అంటున్నాడు కామేశంతో

"భోజనమంటే ఉత్తరదేశంలోనే నోయ్! చక్కగా తిండియొక్క వివిధ రుచులూ, సర్వసౌఖ్యాలూ అనుభవించి మరీ తింటారు మనలా మళ్లీ మళ్లీ ఆ గోంగూరే, ఆ దొండకాయే వేసుకుని ఖాళీ చేయరు. ఆగ్రాకు పేరు రావడానికి ముఖ్య కారణం తాజ్ మహాలే అనుకో. కానీ మెయిన్‌రోడ్ చివరనున్న రెస్టారెంట్ కూడా ఆగ్రా ప్రసిద్ధికి కొంత కారణమంటా నేను. దూద్ పేడా, బాసందిలు నేను తినడం ప్రారంభిస్తే ఎప్పుడు ముగిస్తానో నాకే తెలీదు చపాతీలయితే డజన్లకొద్దీ కొట్టెయ్యొచ్చు. నీవొకసారి ఆ ప్రక్కకు రావోయ్! మీ నాన్నగారు కూడా గుర్తుపట్టలేని విధంగా బలిసొస్తావు"

"హరి భగవాన్! మునుపటి వాక్చాతుర్యమేమయింది? మనిషి లావెక్కితే బుద్ధి మందగిస్తుందన్న మాట నిజమేనా! ఉత్త భోజనప్రియుడుగా తయారయ్యాడే ఈ శేఖరం!" అని లీల లోలోన కుమిలిపోయింది.

"నమస్కారం చేసి లోపలికి వెళ్లొచ్చమ్మా!" అన్న పురోహితుని స్వరం లీలను ఈ లోకానికి లాక్కొచ్చింది. చెరసాలనుండి విడుదల చేయబడినదానిలా లోపలికి గబగబా వెళ్ళింది. ఎవర్నీ చూడడానికీ మనస్కరించలేదు. తన గదిలోకి వెళ్లి కూర్చుని "టైమ్" పత్రికతీసి పేజీలు తిరగేస్తోంది మనసేదో తర్కిస్తోంది కొంతసేపటికి అందరూ ఆ గదిలోకి వచ్చారు.

"ఏం లీలా! నీకు పరమ తృప్తి కదూ? పట్టుదలతో నీ కోర్కెను సాధించుకున్నావ్!" అన్నారు రాఘవయ్యగారు వెయ్యిమీటర్ల పందెంలో పరుగెత్తి ప్రథమస్థానం పొందినవాని పోజులో.

"తృప్తి కేవిట్రా కొంతి? రాళ్లను కరగించేటటువంటి దాని ప్రార్థనలను విని భగవంతుడు కనికరించి, దాని నాథుణ్ణి మూడు రెట్లుగా పంపించాడు"—మేనత్త ఛలోక్తి

"ఓ విషయం గుర్తుంచుకోవోయ్ రాఘవా! అల్లుడిగారికి 'ఫర్నిచర్' సామాన్లు కొనేటప్పుడు, ఈ అంగళ్ళలో తళతళమని మెరుస్తూ నాజూకుగా వుంటాయ్ చూశావూ, వాటిని కొనేయగలవ్ సుమీ! మాంచి 'టేకువుడ్'తో దృఢంగా చేయమని 'స్పెషల్ ఆర్డర్' ఇచ్చెసెయ్ మరొక అంశం—'ఇంత చక్కటి భార్య దొరికిందికదా" అని అల్లుడుగారు ఇంకా బలవవలసిన 'చుటు' ఒకటి వుందని మరవకు!"—అని లెక్చరర్ అయిన మేనమామగారి లెక్చర్.

తన చెల్లెలూ, బావమరదుల హాస్యాన్ని అనుభవించింది ఒక్క రాఘవయ్యగారు మాత్రమే.

అప్పుడే అక్కడకొచ్చిన రామం— "మామయ్యా! విమానంనుంచి దిగగానే ఏదో కొందరు మల్లయుద్ధవీరులు మద్రాసు కొస్తారన్నానే - వారిలో ఒకరేమో అనుకున్నాను మన అల్లుణ్ణి చూసి! అల్లుడుగారేరీ అని వెతికాను అసలు, మీరే ఆయన్ని కనిపెట్టలేకపోయారు కదూ?" అని నవ్వాడు.

లీల ఈ మాటలపోటులను సహించలేకపోయింది ఎంతయినా, తన భర్తను వీళ్లిలా పరిహాసం చేస్తుంటే వూరుకోగలదా?

"ఎక్కువ నవ్వకోయ్ బావా! మళ్ళీ ఓ సంవత్సరంలోపల వారిని మీరు గుర్తుపట్టలేకుండా తయారు చేయలేకపోతే నా పేరు లీలకాదు" అని శపథం చేసింది రోషంతో.

"సరే సరే! వేళాకోళాలు విపరీతాలవుతున్నాయి ఈ శపథాలూ, రోషాలు— ఇవేమిటి? అందరూ వెళ్ళి భోజనాలు కానీయండి" అని రాఘవయ్యగారు సర్దేశారు

ఓ సంవత్సరం పరుగెత్తింది లీలా ఆమె భర్తా దీపావళికి ఢిల్లీనుండి వచ్చారు. చంద్రశేఖరాన్ని చూసి ఆశ్చర్యపడని ప్రాణిలేదు పెళ్ళిరోజున ఏనుగుపిల్లలా వున్న శేఖరం ఇప్పుడు ఉత్త 'ఎముకలూ—చర్మమూ'గా వున్నాడు. అతని రూపం, చూసినవారికి జాలిగొలిపేటట్లుంది. విజయగర్వంతో చూచింది - శ్రీమతి లీల బి. ఎస్ సి

"అల్లుడి కేవిటే జబ్బా? ఇలా చిక్కిపోయారే?" అని మేనత్త అడగడం విన్న ఆనందంతో లీల అర అంగుళం పెరిగి వుంటుందనుకోవచ్చు

"లీలా! చెప్పినట్లు చేసేశావే! ఏమిటి ఆ విద్య?" అని మొహం వేలవేస్తూ అడిగాడు రామం.

"ఇందులో విద్య ఏముంది! ప్రతీరోజూ తప్పకుండా ఉదయమూ సాయంత్రమూ యోగాసనాలూ, రెండు మైళ్ళు నడకా, మితమైన ఇంటిభోజనం - ఇంతకన్నా ఏం కావాలి?" అంది తేలికగా లీల.

ఆరోజు రాత్రి డాబామీద పడుకుని రామంతో చెబుతున్నాడు శేఖరం తన చరిత్రను

"అబ్బాయ్! యోగాసనాలూ, పరుగులూ నన్నిలా సన్నగా చేసినాయని అనుకుంటున్నావ్ కదూ! అదంతా ఒట్టి భ్రమ

నాయనా భ్రమ!—ఇంతటికీ కారణం మీ మరదలి వంట....అయ్యో! ఏం వంటనుకున్నావ్! ఒక వాసనా రుచా?... మొదటి మాసంలోనే అన్న ద్వేషం పుట్టిందోయ్ రేడియోల్లోనూ పత్రికలలోనూ సంపటి మొహం మెరుగని ప్రమదలు (మన పాలిటి ప్రమాదాలు) చెప్పే కూరలూ, బాత్ లూ- ఈవిడ చేస్తే వాటి పేర్లు విని ఆనందించవొచ్చు కానీ, నోటిలో వేసుకున్నప్పట్నుంచీ కడుపు కలియ బెడుతుందోయ్! ఈవిడ త్రాసు తీసుకుని, విటమిన్లూ, కేలోరీలూ, లెక్కకట్టి చేసిన వంటలు సన్నిలా చేసినయ్

తాను రాగానే వంటమనిషిని తరిమేసింది. 'నీకెందుకు ఈ కష్టం హాయిగా తిని

# ★ చేయి జారిన లక్ష్మి ★

లక్ష్మణరావు దగ్గర్నించి ఉత్తరం వచ్చిందంటేనే అనుకున్నాడు, ఏదో విశేషముందని. దాంతోపాటు శుభలేఖ గూడా వుందిట. కృష్ణమూర్తి మరింత ఆశ్చర్యపడ్డాడు. బజారునుంచి వచ్చి ఇంట్లో కాలు పెట్టగానే చెల్లెలు ఎదురుగుండా వచ్చి "నీకు లక్ష్మణరావు దగ్గర్నించి ఉత్తరం-శుభలేక వచ్చాయిరా అన్నాయ్" అని చెప్పి లోనికివెళ్ళి తెచ్చిచ్చింది - ఓ కవరు, ఓ బుక్ పోస్టు కవరు. ఒకటి శుభలేఖని తెలుస్తూనేవుంది. కవరు చింపి ఉత్తరం బయటికితీసి చదివాడు.

కృష్ణమూర్తికి—

ప్రియ మిత్రుడు వ్రాయునది ఏమనగా—ఎంతకాలంనుంచో కలలు కంటున్న ఆదర్శాలు ఈనాటికి నెరవేరుతున్నాయి. దానికంతటికీ నిన్నభినందిస్తున్నాను. వివాహానికి నువ్వు తప్పకుండా రావాలి. నువ్వు రాకపోయావంటే ఇక ఇంతటితో మన స్నేహం సరి. తెలుసుగా! ఎన్ని పనులున్నా నువ్వుమాత్రం తప్పించుకోడానికి వీల్లేదు. కుటుంబ సమేతంగా వస్తే ఇంకా మంచిది. ఈమాట మర్చిపోవుగా!? వుంటాను. ఇట్లు, నీ ప్రియమిత్రుడు, లక్ష్మణరావు—

ఇంతకూ పెళ్లెవరిది? శుభలేఖ తీశాడు. పెళ్లి లక్ష్మణరావుదేనట! శుభలేక, ఉత్తరం వేరువేరుగా వేయడంలో వుద్దేశ్యమేమిటి? అని ఆలోచించాడు. అసలు కృష్ణమూర్తికి ఈ వార్త అసత్యమని తోచింది. అతనికింత త్వరలో పెళ్లవటానికి వీల్లేదే! అసలు లక్ష్మణరావూ, కృష్ణమూర్తీ కలిసి నాలుగు సంవత్సరాలు ఒకే ఊళ్ళో ఒకే గదిలో ఉంటూ చదివారు. శుభలేఖ వచ్చినప్పుడు కృష్ణమూర్తి అంతగా సందిగ్ధావస్థలోపడి, అసలు ఈవార్త నిజమా, అబద్ధమా అని

* ~~~~~~~~~~ *

"తిరునగర్"

* ~~~~~~~~~~ *

ఆలోచించడానికి కారణం, లక్ష్మణరావుతో ఓ వ్యవహారంలో తగుల్కొని సతమతమయ్యాడు. ఇంతలో బి. ఏ ఫైనలియరు అయిపోయి లక్ష్మణరావు వాళ్ళవూరెళ్ళాడు. ఆరోజు కృష్ణమూర్తి లక్ష్మణరావును రైలెక్కించి "అబ్బ! వదిలిందిరా బాబూ జిడ్డు వ్యవహారం" అని గుండె సర్దుకున్నాడు గూడా!

ఓరోజు రూమ్‌లో ఖులాసాగా కబుర్లు చెప్పుకొంటూ "బాగా డబ్బుగల సంబంధం చేసుకోవాలోయ్ మా నాన్న నాకోసం ఎంత డబ్బు ఖర్చు చేస్తున్నాడు! మా కుటుంబం చాలా పెద్దది. ఏదన్నా అదృష్టం కలిసివస్తే బావుండును" అన్నాడు లక్ష్మణరావు.

"బాగానే వుంటుంది గానీ దొరకదోయి నాయనా! అందరికీ వుంది - పెద్ద నీ ఒక్కడికేనా ఏం డబ్బుగల సంబంధం వస్తే బావుంటేది" అన్నాడు కృష్ణమూర్తి మాట వచ్చింది గనక.

"కాదు కాదు. పిల్ల ఎలా వున్నా నాకేమీ పర్వాలేదు. కట్నంమాత్రం ఎక్కువిస్తే చాలు. పిల్లలో ఏ లోపాలున్నా సరిపెట్టుగుంటాను. అందరికీ అలా సమ్మతం అవుతుందంటావా?" అన్నాడు లక్ష్మణరావు.

"పోవోయ్, అన్నీ కబుర్లు. డబ్బుకోసం నీవు ఆత్మని అమ్ముకుంటావా ఏం?" అన్నాడు కృష్ణమూర్తి, ఏ నవల్లో భావాన్నో పట్టుకుని.

"ఆత్మని అమ్ముకోవడ మేమిటోయ్ పిచ్చివాడా! డబ్బు లేంగే జీవితం ఎందుకసలు? అది వుంటే ఎన్ని లోపాలైనా సర్దుకుపోవచ్చు!"

కృష్ణమూర్తి స్నేహితుడి మాటలు అంత తేలిగ్గా నమ్మలేదు ఇప్పుడిప్పుడే అతనికి ఒక్కో విషయంమీద ఒకవిధంగా నిర్ణీతమైన భావాలు ఏర్పడుతున్నాయి మిత్రుణ్ణి పరీక్షచెయ్యడానికి పూనుకొని అందుకు ఓ అభూతకల్పన చేశాడు "పిల్ల ఎంత అందంగా లేకపోయినా డౌరీ ఎక్కువిస్తే చేసుకుంటా వన్నమాట!" అన్నాడు కృష్ణమూర్తి.

"ఓ! నే నామెతో సరిపెట్టుకోగల్ను" హామీ ఇచ్చాడు లక్ష్మణరావు.

"అయితే బెజవాడలో ఓ సంబంధం వుంది ఆ అమ్మాయికి ఓ కాలు పోటు - కన్ను మెల్ల - చేయి వంకరపోయింది - పై పెదవి తోసేసుకుని పళ్లు బయటికి పొడుచుకొచ్చాయి; కాని తండ్రి మంచి ఆస్తిపరుడు. ఒక్కతే కూతురు. యాభై ఎకరాల పొలం - చాలా డబ్బు నిల్వవుంది. కాని వాళ్లు దీదేశం గాదు. ఉత్తరహిందూస్థానం. వాళ్లకిక్కడా భూము లున్నాయిట. బెజవాడలో వాళ్లకో మేడ వుంది. అప్పుడప్పుడు వచ్చిపోతూ వుంటారు. మా మేనమామకూ ఆయనకూ స్నేహం. మొన్న నేను వెళ్లినప్పుడు అక్కడే వున్నారు వాళ్ళు. మా మామయ్యకు వుత్తరం వ్రాయమంటావా?" అన్నాడు కథ అల్లి.

లక్ష్మణరావు అంతా చెవులు నిక్కించి విని "నిజంగా నేనా?" అని కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించాడు.

"నే చెప్పలేదుటోయ్. డబ్బుకోసం నీ శరీరాన్ని అమ్ముకోలేవు" అన్నాడు విజయం తనదేనన్నట్టు గర్వంగా కృష్ణమూర్తి.

"కాదోయ్" అడ్డుపడ్డాడు లక్ష్మణరావు. "మా మాష్టార్ని కలుసుకొని అడిగి చెపుతాను" అన్నాడు కృష్ణమూర్తి అప్పటికే తన విజయాన్ని స్థిరీకరించుకున్నాడు. తరవాతవాళ్లిద్దరిమధ్యా సంభాషణేమీ నడవ

---

## ★ కోరిన వరుడు ★

కూరో్చక?' అని నేనెంత చాకచాక్యంగా బతిమిలాడినా, 'బాగుంది! నేను చదివిన పుస్తకాలూ, విన్న రేడియో ప్రసంగాలూ వృధాపోవడమా! వంట అంటే ఏమో తెలియని ఈ వెధవలందరూ ఇష్టమొచ్చినట్లు అర్థంపర్థం లేకుండా చేసే వంటలన్నీ తిని ఒళ్ళు "పాడు"చేసుకుంటారా?' అని నిర్దాక్షిణ్యంగా తిరస్కరించి తాను వండడం మొదలుపెట్టింది.

"ఇలా చూడు రామం! నీవు పెళ్ళి చేసుకునేటట్లయితే - చేసుకోకుండా వుండడం ఉత్తమమూ, పూర్వజన్మ సుకృతమూ అనుకో—అయినా చేసుకుంటే - ఈ 'హోం సైన్సు' బి. ఎస్ సీ. లున్నారు చూశావూ, ఆ కుమారీమణులవైపు పోకుసుమా! వేరే హిస్టరీ—బోటనీ, లిటరేచర్—దేన్నయినా చేసుకో. కానీ ఈ 'హోం సైన్సు' ప్రదేశాల్ను మాత్రం బహు అపాయకరములని గుర్తుంచుకో" అని స్వానుభవమున నేర్చిన సందేశాన్ని చాటాడు చంద్రశేఖరం ఆరోజు రాత్రి! ★

లేదు. కృష్ణమూర్తి ఆ విషయాన్ని గురించి ఆలోచించడమే మానేశాడు ఇద్దరు మిత్రులూ మేనులు వాల్చారు. కృష్ణమూర్తి అర్ధరాత్రప్పుడు గాబోలు మెలకువవచ్చి లేచాడు. చూస్తే లక్ష్మణరావు ఇంటి పైకప్పువంక చూస్తూ వెల్లకిలా పండుకొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. కృష్ణమూర్తి అతన్ని చూచి నవ్వుకున్నాడు.

రెండోరోజు రాత్రి లక్ష్మణరావు రూమ్‌కి ఆలస్యంగా వచ్చాడు. రాగానే "మా మాష్టారుతో చెప్పానోయ్! ఆయనా ఒప్పుకొన్నారు. కాస్త ఉత్తరం రాసెయ్ మీ మావయ్యకి, వివరాలు తెలియ జెయ్యమని, లేకపోతే మనిద్దరం ఓసారి వెళ్ళివద్దామా ఏం?" అన్నాడు.

కొంప మునిగిందనుకున్నాడు కృష్ణమూర్తి. కాని ఆ భావం బయటికి కనపడనిస్తే లక్ష్మణరావు ఏమంటాడు? "ఆఁ! ఎందుకు లేవోయ్! నా మావయ్యకి కాకితో కబురు పంపితే చాలు. అన్నీ క్షణంలో తెలియజెయ్యడూ?" అన్నాడు. దీని పరిణామం ఎలా వుంటుందో క్రిష్ణమూర్తి ప్రస్తుతానికి వూహించలేకపోయాడు.

లక్ష్మణరావుకి ఓ మాష్టారున్నారు. ఆయన పిలవడానికి మాత్రమే మాష్టారు. ఆయనను చూస్తే కృష్ణమూర్తికి గిరీశం గుర్తుకొస్తాడు. లక్ష్మణరావు - మాష్టారుల జంట చూస్తే గిరీశం పంతులూ - అగ్నిహోత్రావధానిగారి సుపుత్రుడూ గుర్తుకొస్తారు. ఒక్కొక్కప్పుడు "గురజాడ వారు మీ ఇద్దర్నీ చూసే "కన్యాశుల్కం రాశారోయ్" అంటూ వుంటాడు లక్ష్మణరావుని. అటువంటి మాష్టారితో లక్ష్మణరావు తను చేసిన అభూతకల్పన నిజంగా నమ్మి చెప్పేశాడు. ఆ అపరగిరీశంగారి విషయం తనకి బాగా తెలుసు. ఆయననోట్లో మాట దాగదు. ఏమిటోయ్ భగవంతుడా ఇలా వచ్చిపడింది. ఆ రాత్రి వెధవది అలా కట్టుకథ చెప్పకపోయినా పోయేది. లక్ష్మణరావు ఇంతచేస్తాడు అనుకోలేదు. సరే! గత జలసేతుబంధనం ఎందుకు? ఎలాగో దీన్ని తప్పించుకొనే ఉపాయం చూడాలి" అని ఆలోచించాడు కృష్ణమూర్తి. నిజాన్ని ఇప్పుడు చెప్పితే తనని పీక్కుతినేస్తారు ఆ గిరీశం, వెంకటేశం కలిసి. అందుకని లక్ష్మణరావుతో,

"అలాగే ఉత్తరం రాస్తాలేవోయ్" అన్నాడు.

"ఇవ్వాళ కాదు. రేపు రాసేస్తావుగా?"

"ఊఁ"

రాత్రి మళ్ళా లక్ష్మణరావు ఎంక్వయిరీ: "ఉత్తరం రాశావా?"

"ఆ" ఢంకామీద దెబ్బకొట్టినట్లు కృష్ణమూర్తి సమాధానం!! లక్ష్మణరావు వదలకుండా అంతటితో వూరుకోలేదు" పిల్ల గురించి నీకు తెలిసింది చెప్పు ఇంకోసారి?" పరీక్షల ప్రశ్నాపత్రాల్లో ఇచ్చే ప్రశ్నకు మళ్లే అడిగాడు.

కృష్ణమూర్తి మాత్రం తక్కువ వాడేమీ కాదు అమ్మాయికి ఎన్ని లోపాలుంటే అందవికారంగావుంటుందో అన్ని లోపాలూ ఆరోపించాడు. లక్ష్మణరావు ఇది విన్నైనా తన వుద్దేశాన్ని మార్చుకోవచ్చని కృష్ణమూర్తి ఆశ.

లక్ష్మణరావు చచ్చినా ఆ పని చెయ్యడు అన్ని లోపాలుంటే మరీ మంచిది. మంచి సంస్కారం వుండివుంటుంది. మనకున్న సంస్కారాన్ని ఉపయోగించి మనమంటే ఆమెకు పడి చచ్చిపోయేటంతటి ప్రేమ కలిగించచ్చు!" అని సమర్థించుకున్నాడు.

"ఉత్తరానికి రిప్లై వచ్చిందటోయ్" ఈ

( -వ పేజీ చూడండి)



గజశాల—హంపి



—ఫోటో : టి. సత్యనారాయణ, పిప్పర.




# ఆట - పాట



వేజెండ్ల సాంబశివరావు

ఆటలు ఆడెదము - మేము
పాటలు పాడెదము.
ఆటల నాడి పాటలు పాడి
అల్లి బిల్లి తిరిగెదము - మేము
అమితానందం పొందెదము.

పూలను కోసెదము - మల్లె
పూలను కోసెదము
దండలు గ్రుచ్చి ఒళ్లో దాచి
మురిసిపోయెదము - పెళ్లికి
తరలిపోయెదము.

ఇల్లూ కట్టెదము - బొమ్మ
రిల్లూ కట్టెదము.
తాటియాకుల బొమ్మలు చేసి
పెండిలి చేసెదము - పూల
దండలు వేసెదము.

బూరల నూదెదము - ఆకు
బూరల నూదెదము.
తూతూతూతూ బాజాల్తోటి
పెండిలి చేసెదము - పూల
పల్లకి మోసెదము.

పిడతలు తెస్తాము - లక్క
పిడతలు తెస్తాము.
పాలూ బెల్లం-పరమాన్నాలూ
పెండ్లికి పెద్దలమై - మేము
జుర్రున జుర్రెదము.

అమ్మలు పిలవంగా - మా
నాన్నలు పిలవంగా,
ఆటలపాటల నన్నిటి విడిచి
ఇంటికి వెళ్లెదము - మేము
విడిపడిపోయెదము.



# అదృష్టదేవత

పూర్వం సైప్రస్ అనే ద్వీపంలో ఒక రేవుపట్టణంలో తియొడోరస్ అనే ధనవంతుడుండేవాడు. అతనికి అపారమైన ధనసంపద ఉన్నది; ఫార్చునేటస్ (అదృష్టదీపుడు) అనే చక్కని కొడుకున్నాడు. తియొడోరస్ ఏ కొరతా లేకుండా హాయిగా జీవిస్తూ, మితిమీరిన భోగవిలాసాలలో పడి కొంతకాలానికి తన ధనమంతా పోగొట్టుకున్నాడు. అతడు బీదవాడయేసరికి అంతవరకూ అతని చుట్టూ ఈగల్లా మూగిన ఏ మిత్రుడూ అతనికేసి చూసినపాపాన పోలేదు. పాపం అతడు అలాగే కష్టపడి భార్యతో, కొడుకుతో రోజులు వెళ్లబుచ్చుతున్నాడు.

ఫార్చునేటస్ పెద్దవాడయ్యాడు. ఒకరోజున తండ్రి అతణ్ణి చూసి, "నాయనా! నీకు చాలాఅన్యాయం చేశాను డబ్బంతా ఖర్చు పెట్టి నీకు చిల్లిగవ్వయినా మిగల్చకుండా దరిద్రుణ్ణి చేశాను. నే నెలాగూ ఆట్టేరోజు లుండను. నీకోసమే నా బెంగ," అన్నాడు.

"నాన్నగారూ! నాకోసం మీరేమీ బెంగపడకండి. నేను ఏదో విధంగా బ్రతకగలను. వెంటనే బయలుదేరి దేశాటనంచేసి అదృష్టం వెదుక్కుంటూ పోతాను. త్వరలో తిరిగివస్తాను," అన్నాడు ఫార్చునేటస్.

ఆరోజున భోజనాలైన తరవాత ఫార్చునేటస్ తలిదండ్రులవద్ద సెలవు తీసుకుని సముద్రతీరానికి వెళ్ళాడు. అక్కడ ఒక ఓడ ఇటలీలోని ఫ్లాండర్సు పట్నానికి బయలుదేరుతూ ఉండడం చూశాడు. ఆ ఓడలో ఫ్లాండర్సు పరిపాలించే ప్రభువు ఒకాయనకూడా ఉన్నాడు. ఫార్చునేటస్ సరాసరి ఆ ప్రభువు వద్దకు వెళ్ళి నమస్కరించాడు. తన సంగతంతా చెప్పి, ఆయనవద్ద అంగరక్షకుడుగా పనిచేస్తానని చెప్పాడు. ఆయువకుడి అందచందాలు, వినయవిధేయతలు చూసి సంతోషించి ఫ్లాండర్సు ప్రభువు అంగీకరించాడు.

ఓడ బయలుదేరి ఫ్లాండర్సు చేరింది. ఫార్చునేటస్ తన ప్రభువును ఎల్లవేళలా అంటిపెట్టుకుని ఉండి భక్తి గౌరవాలు చూపుతున్నాడు. ప్రభువుకు అతనిపై బాగా నమ్మకం కుదిరింది. కొత్తగా వచ్చిన యువకునిపై ప్రభువు ఇంత నమ్మకం కలిగిఉండడం సహించలేక కొంతమంది పాత సేవకులు ఎలాగైనా ఫార్చునేటస్‌ను సాగనంపాలని పన్నాగాలు పన్నుతున్నారు.

ఒకరోజున ప్రభువు వినోదార్థం గుర్రపుపందాలు ఏర్పాటుచేశాడు. గెలిచినవారికి మామూలుగా ఇచ్చే బహుమతులు కాక తను ప్రత్యేకంగా రెండు వజ్రాలు బహుమతి చేస్తానని ప్రభువుగారి భార్య ప్రకటించింది. ఆ పందాలలో అందర్నీ ఓడించి ఫార్చునేటస్ మొదటివాడుగా వచ్చాడు. అతనికి రాణీగారి రెండు వజ్రాలు, ఇంకా ఎంతమందినుంచో ఎన్నో విలువైన బహుమతులు వచ్చాయి. అతన్ని ప్రజలందరూ పొగుడుతున్నారు. ఈ పొగడ్తలు అతని శత్రువులకు మరింత అసూయ కలిగించినవి. అందుచేత వాళ్లు ఫార్చునేటస్‌ను చాటుకు పిలిచి, "మిత్రమా! నీమీద ప్రభువుగారు చాలా కోపంగా ఉన్నారు. నీకు ఇన్ని బహుమతులు రావడంవల్ల ఆయనకి అసూయ కలిగింది. ఈ రాత్రే నిన్ను చంపించటానికి ఆయన ఆలోచిస్తున్నారు. కనక వెంటనే ఇక్కణ్ణించి పారిపో," అని నూరిపోశారు.

ఫార్చునేటస్ ఇదంతా నిజమేనని నమ్మాడు. నమ్మి ఆరోజు చికటి పడగానే, అశ్వశాలలోంచి ఒక గుర్రాన్ని తీసుకుని,

సావుగానం సరస్వతీదేవి



# ★ అదృష్టదేవత ★

దాన్నెక్కి ఎవరూ చూడకుండా ఉడాయించాడు. తెల్లవారేసరికల్లా ఫ్లాండర్సు రాజ్యం దాటి చాల దూరం వచ్చాడు. మార్గాయాసం తీర్చుకోడానికి ఒక ఊళ్ళో ఒక సత్రంలో ఆగాడు. తనతో తన బహుమతులన్నీ తెచ్చుకోవడంచేత వాటన్నిటినీ అమ్మి డబ్బుగా మార్చుకొన్నాడు. కొంత డబ్బుతో ఒక గుర్రం కొన్నాడు. ఫ్లాండర్సు ప్రభువు అశ్వశాలనుండి తీసుకొచ్చిన గుర్రాన్ని ఒక మనిషి ద్వారా తిరిగి వెనక్కి పంపించాడు.

ఫ్లాండర్సు ప్రభువు విశ్వాసపాత్రుడైన ఫార్చునేటస్ ఇలా అర్థాంతరంగా పారిపోయినందుకు ఎంతో విచారించాడు.

## 2

ఫార్చునేటస్ అలా పోయిపోయి దేశాలన్నీ తిరుగుతూ చివరికి లండన్ నగరం చేరుకున్నాడు. చేతిలో బాగా డబ్బు ఆడుతున్నందున గొప్ప గొప్పవాళ్ళతో పరిచయాలేర్పడ్డాయి. వాళ్ళతో తిరుగుతూ, వాళ్ల హోదాకు తగ్గట్టుగా తను కూడా ఉండబోయేసరికి, దగ్గిరున్న డబ్బు కాస్తా హారతికర్పూరంలా హరించిపోయింది. మళ్ళీ యథాప్రకారం బీదవాడయ్యాడు. అందుచేత లండన్ నగరంలో ఉండలేక, సముద్రం దాటి ఫ్రాన్సుదేశం వెళ్ళాడు. అక్కడ ఉద్యోగాలకోసం ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని లాభించలేదు. అలా పల్లెలూ, పట్నాలూ ద్రిమ్మరుతూ ఒక అడవిలో దారి తెలియక చిక్కుపడ్డాడు. అలా సాయంత్రందాకా వెదుకులాడినా బయటపడలేకపోయాడు. ఆకలీ, దాహం బాధిస్తున్నాయి. అక్కడొక సెలయేరు కనిపిస్తే కడుపునిండా మంచినీళ్లు తాగాడు. ఆకలిమాత్రం తీరలేదు. చీకటి పడింది. దుష్టజంతువులవలన భయం రావచ్చునని ఒక చెట్టెక్కి చెట్లకొమ్మలపైన నడుం వాల్చాడు. వెన్నెల వచ్చింది.

ఇంతలో ఒక సింహం వచ్చి సెలయేటిలో నీళ్లు తాగిపోయింది. తరువాత ఒక ఎలుగుబంటి వచ్చింది. నీళ్లు తాగి, ఒళ్లు విరుచుకుని పైకి చూసింది. వెన్నెల వెలుగులో ఫార్చునేటస్ కనిపించాడు. సరే తిండి కూడా దొరికిందిగదా అని తాపీగా చెట్టెక్కసాగింది. ఫార్చునేటస్ భయకంపితుడయ్యాడు. తిరిగి ధైర్యం తెచ్చుకుని కత్తి దూశాడు. ఎలుగుబంటిని దగ్గిరదాకా రానిచ్చి పొడిచాడు. ఎలుగుబంటి దెబ్బ తినికూడా రోషావేశంతో అతనిపైకి దూకింది. కాని ఆ దూకడంలో చెట్టుకొమ్మ విరిగి ధబేలున క్రిందపడి పొర్లాడసాగింది. ఫార్చునేటస్ చెట్టు దిగి కత్తితో బాగా పొడిచి ఎలుగుబంటిని చంపేశాడు. ఆకలి తీర్చుకోడానికి ఎలుగుబంటి మాంసమే వండుకొని తిందా మనుకుని ఉపక్రమించాడు.

అప్పుడొక విచిత్రం జరిగింది. అతని కొక దేవత ప్రత్యక్షమైంది. "నా పేరు అదృష్టదేవత. నీ దుస్థితి చూసి వచ్చాను. నీకు కావలసిన వరం కోరుకో, ఇస్తా"నంది. "నాకు

మరేం అక్కర్లేదు. అమితమైన ధనం కావా" లన్నాడు. నరేనని అదృష్టదేవత అతని కొక పర్సు ఇచ్చింది. ఆ పర్సులో ఎప్పుడు చెయ్యి పెట్టినా పది బంగారు నాణాలు కనిపిస్తాయంది. అతడు బ్రతికున్నంతకాలమే కాక అతని బిడ్డలకు కూడా ఆ పర్సు ధనం ఇస్తుందనీ, వారి తరవాత దాని మహిమ పోతుందనీ చెప్పింది.

తరవాత అదృష్టదేవత అడవి నుంచి అవతలికి దారి చూపించి మాయమైంది.

ఆ దారిన అతడు నడిచి నడిచి ఒక గ్రామం చేరి సత్రంలో మకాం చేశాడు. పర్సులోంచి బంగారునాణాలు తీసి సత్రం యజమాని కిచ్చి సుష్టుగా భోజనం చేశాడు. అక్కణ్ణించి తెల్లవారిన తర్వాత దగ్గర్లోఉన్న ఒక పట్నం వెళ్ళి మంచి గుర్రం కొన్నాడు. మంచిబట్టలు కుట్టించాడు. ఇద్దరు సేవకులను కుదుర్చుకున్నాడు. ఫ్రాన్సుదేశానికి రాజధాని అయిన పారిస్ నగరం వెళ్లాడు. ఒక గొప్ప భవనం కొనేసి, అందులో ఉంటూ, ధనం విచ్చలవిడిగా ఖర్చు పెడుతూ దర్జాగా బ్రతకసాగాడు.

కొంతకాలం అయిన తర్వాత అతనికి మళ్ళీ వివిధ దేశాలు తిరిగి కొత్త విశేషాలు చూడాలనే కోరిక పుట్టింది. అయితే ఒక్కడే వెళ్లడానికి మనస్కరించలేదు. ఎవడైనా అనుభవజ్ఞుడైనవాడు దొరికితే బాగుండు ననిపించింది. వెదకగా వెదకగా ఒక వృద్ధుడు కనిపించాడు. అతని పేరు లాక్ ఫిట్టీ. స్కాట్లండు దేశంవాడు. అతడు కూడా బ్రతుకు తెరువుకోసం దేశం విడిచిపెట్టి ఫ్రాన్సు వచ్చాడు. కాని ఏ పని చేసినా లాభించక ఇంకా బికారిగానే ఉన్నాడు. అతణ్ణి అడగ్గానే దేశాటనం రావడానికి ఒప్పుకున్నాడు. అయితే ముందు ఒకసారి స్వదేశం వెళ్ళి భార్యాబిడ్డలను చూసిరావాలనుందన్నాడు. ఫార్చునేటస్ సరేనన్నాడు. తనుకూడా లాక్ ఫిట్టీతో స్కాట్లండు వెడదామని నిశ్చయించాడు. ఇద్దరూ కలిసి బయలుదేరారు.

స్కాట్లండు చేరారు. లాక్ ఫిట్టీ భార్య, అయిదుగురు కూతుళ్లు చాలరోజుల తరవాత అతడు తిరిగి వచ్చినందుకు సంతోషించారు. లాక్ ఫిట్టీ కుటుంబం ఒకప్పుడు బాగా బ్రతికినదే. కాలం ఖర్మం చాలక బీదదశలో పడింది. వారి కష్టాలన్నీ విని ఫార్చునేటస్ చాలా జాలిపడ్డాడు. వారికి ధనసహాయం చేయడానికి నిశ్చయించాడు. కాని వారు అతని సహాయం ఉచితంగా తీసుకోడానికి అంగీకరించలేదు. వారి అభిప్రాయం గ్రహించి అతడు లాక్ ఫిట్టీ పెద్దకూతురును వివాహం చేసుకోడానికి ఒప్పుకున్నాడు. వివాహంమాట వచ్చేసరికి ఫార్చునేటస్‌కు తన తలిదండ్రుల విషయం



గాత - శ్రోత—ఫొటో : శిష్టా బ్రహ్మానందం.

## ★ అదృష్టదేవత ★

జ్ఞాపకం వచ్చింది. వెంటనే ప్రయాణసన్నాహాలు చేసి లాక్‌ఫిట్టీ కుటుంబాన్నంతటినీ వెంటబెట్టుకుని స్వదేశమైన సైప్రస్‌కు బయల్దేరాడు.

కొన్ని దినాలకు సైప్రస్ చేరుకున్నారు. ఎంతో ఆదుర్దాపడి తీరా స్వదేశం వస్తే, ఫార్చ్యునేటస్ తలిదండ్రులు కొడుకుమీద బెంగతో ఎన్నడో చనిపోయినట్లు తెలిసింది. కొన్ని రోజులు విచారంతో గడిపాడు. తరవాత ఫార్చ్యునేటస్ బంధువుల ఓదార్పులతో స్థిమితపడి లాక్‌ఫిట్టీ పెద్దకుమార్తెను వివాహం చేసుకున్నాడు. అత్తామామలను, మరదళ్ళను తనవద్దనే అట్టిపెట్టుకుని, అదృష్టదేవత ఇచ్చిన పర్సు ప్రభావంతో మహావైభవంగా గడపసాగాడు.

పన్నెండేళ్లు గడిచాయి. ఇద్దరు చక్కని కొడుకులు కలిగారు. మరదళ్లందరికీ మంచి వరులను వెదికి పెళ్లిళ్లు చేశాడు. కొంతకాలానికి అతనికి మళ్లీ దేశాటనంమీద దృష్టిపోయింది. అత్తమామలు, భార్య వద్దంటున్నా వినక త్వరలో తిరిగివస్తానని చెప్పి బయలుదేరాడు. ఒక ఓడ ఈజిప్టుదేశానికి పోతుంటే అందులో ఎక్కాడు.

### 3

ఓడ ఈజిప్టులోని అలెగ్జాండ్రియా రేవు చేరింది. చేరగానే, సుల్తానుగారికి అయిదువేల బంగారు నాణాల ఖరీదుచేసే కానుకలు పంపించాడు. ఆయన ఫార్చ్యునే

పల్లెటి దిక్కుమనిషి ఒకడు వానపడ్డ ఒకరోజు, బురద కాళ్ళతో బస్తీకొచ్చి, పెద్ద హోటల్‌లోకి వెళ్ళాడు. ఆ బురదను చూసి బెదురుకొన్న హోటల్ యజమాని గబగబా యివతలకు వచ్చి "అంత బురద కొట్టుకున్న చెప్పులు తొడుక్కొని లోపలికి రాకపోతే, అవి బయటనే వొదిలి రాలేక పోయావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఫులిక్కిపడి బిత్తరి చూపులు చూస్తున్న ఆ రైతు "చెప్పులు ఏడవండి?" అని ఎదురు ప్రశ్న అడిగాడు.

టస్‌ను ఎంతో మర్యాదచేసి, తను కూడా ఖరీదైన సుగంధ ద్రవ్యాలు కానుక ఇచ్చాడు. ఫార్చునేటస్ ఆ కానుకలను తను వచ్చిన ఓడలోనే భార్యకు పంపించాడు. ఈజిప్టులో కొన్నాళ్ళుండి, ఇంకా తూర్పునగల దేశాలు చూడాలనే అభిలాషతో టర్కీ, పర్షియా, భరతఖండం అన్నీ తిరిగాడు. పాలస్తీనాగుండా మళ్ళీ అలెగ్జాండ్రియా వచ్చాడు. తిరిగి సుల్తానును కలుసుకుని, తను తిరిగిన దేశాల్లో సేకరించిన వింతవింత వస్తువులను ఆయనకి బహూకరించాడు.

సుల్తాను ఫార్చునేటస్‌ను తన భవనంలో అతిథిగా కొన్నాళ్ళుండమని కోరాడు. ఒకరోజున సుల్తాను తనవద్ద ఒక అమూల్య వస్తువుంది చూడ రమ్మన్నాడు. ఒక రహస్య మందిరంలోకి తీసుకువెళ్ళాడు. ఒక బంగారుపెట్టె తెరచి అందులోంచి ఒక టోపీ బైటికి తీశాడు. ఫార్చునేటస్ "ఇందులో ఏమి విశేషం ఉంది?" అని అడిగాడు. "ఇది నెత్తిమీద పెట్టుకుని ఎక్కడికి వెళ్లాలంటే అక్కడికి వెళ్లవచ్చు," అన్నాడు సుల్తాను.

"అరె. విచిత్రంగా ఉందే! ఈ టోపీ బాగా బరువుగావుంటుందా?" అన్నాడు ఫార్చునేటస్.

"అబ్బే. పరమ తేలిక. కావలిస్తే పెట్టుకు చూడు," అన్నాడు సుల్తాను.

ఫార్చునేటస్ టోపీ పెట్టుకుని "నేను మాయింటి వెనక ఉద్యానవనంలో ఉండాలి," అనుకున్నాడు. మరుక్షణంలో ఫార్చునేటస్ తన యింటి వెనక నిలబడి ఉన్నాడు. సుల్తాను పాపం అతడు తిరిగివస్తాడని చాలరోజులు ఎదురుచూశాడు. చివరికి నిరాశచేసుకుని ఊరుకున్నాడు.

ఫార్చునేటస్ ఇంట్లోకి వెళ్లాడు. భార్య, కొడుకులు అతణ్ణి చూసి ఎంతో సంతోషించారు. అత్తమామ లిద్దరూ చనిపోయారు. కొడుకు లిద్దరూ పెద్దవారయ్యారు. వారికి విద్యాబుద్ధులు చెప్పించాడు. పెళ్లిళ్లుచేశాడు. సుల్తానువద్ద సంగ్రహించిన టోపీతో ఎన్నో దేశాలు సంచరించి దేశయాత్రాతృష్ణ తీర్చుకున్నాడు.

అదృష్టదేవత చల్లనిచూపులో ఫార్చునేటస్ సర్వసుఖాలూ అనుభవించి చాల ఏళ్ళు గడిపాడు. భార్య చనిపోయింది. అతడుకూడా చనిపోయే కాలం ఆసన్నమైంది. అప్పుడు ఇద్దరు కుమారులనూ దగ్గిరికి పిలిచి నలభై ఏళ్లపాటు ఎవరికీ తెలియకుండా దాచిన పర్సు రహస్యం వారిరువురికీ చెప్పేశాడు. "మీలో మీరు కొట్లాడుకోకుండా జాగ్రత్తగా ఈ పర్సును వాడుకోండి. దానధర్మాలుచేస్తూ ధనం సద్వినియోగం చెయ్యండి. ఇదిగో ఈ టోపీ కూడా తీసుకోండి. దేశాలు తిరగాలనిపించినప్పుడు దీని సహాయంతో క్షణంలో ఎక్కడికైనా వెళ్ళిపోవచ్చు. జాగ్రత్త!" అని చెప్పాడు. వాళ్లు అలాగేనన్నారు.

కొన్నాళ్లకు ఫార్చునేటస్ మరణించాడు. అతని శవాన్ని ఆతని భార్యసమాధిపక్కనే పాతిపెట్టారు. అతని కొడుకులిద్దరూ బుద్ధిమంతులై తండ్రి అడుగుజాడల్లోనే నడిచి హాయిగా జీవించారు.

(మూలం : రస్కిన్) 

బస్తీలో కాలేజీ చదువు చదువుతున్న ఒకఅమ్మాయి మేనత్త యింటికి పల్లెటూరికి వచ్చింది. మేనత్తకొడుకూ, యీ అమ్మాయి కలిసి ఒకరోజు సరదాగా పొలాలమీదికి షికారుకి వెళ్లారు. అక్కడ పొలంగట్టు మీద ఒక ఆవూ, దూడ ఒక దానిని ఒకటి ముట్టెతో ముద్దు పెట్టుకొంటున్నాయి. ఆ కుర్రవాడు వాటికేసి చూపించి తనకూ అలా చెయ్యాలని వుందన్నాడు కొంటెతనానికి.

"చెయ్యి. నిరభ్యంతరంగా చెయ్యి. మీదేగా!" ఆ ఆవు అన్నదా గడుసుపిల్ల.



# కర్పూర ద్వీప యాత్ర

(బొమ్మరిల్లు సీరియల్)

నోరి నరసింహశాస్త్రి

## 22

అట్లా ఎన్నో రోజులు గడవలేదు. అంతా గుడ్లలోనుంచి బయటపడ్డారు. బయటపడ్డదే వ్యవధానంగా పూర్వస్మృతులు మరిచిపోయినారు.

అయితే ఏం? ఇప్పుడు నడిచేందుకు కాళ్లున్నై. అరిచేందుకు నోళ్లున్నై. చూసేందుకు కళ్లున్నై, ఇంకో విశేషంకూడా ఇప్పుడున్నది. ఎగిరేందుకు రెక్కలుకూడా ఉన్నై. రెక్కలింకా బలంపట్టలేదు. కాని అసలున్నవిగా!

అయినా ఇది నయంకాదూ? మనస్సులో పూర్వజన్మజ్ఞానముండికూడా కదిలేకాళ్లూ ఆడేనోరూ చూచేచూపూ లేనికలవంటి అయోమయపు బ్రతుకుకంటె ఇది నయంకాదూ?

మునుపు ఎంతదూరం పోయినా అల్లీబిల్లీ తిరిగినట్లు మనస్సులోనే పోవలెనాయెను! ఎంత చెబుదామన్నా మనస్సులోనే చెప్పకోవలెనాయె! బయట ఎంతోలోకము ఉన్నదని ఎరిగికూడా తనలోపలనే చూచుకొనవలెనాయె! అబ్బా! ఏమి అవస్థబ్రతుకు గుడ్డులోబ్రతుకు! పోనీ, జ్ఞానంలేకపోయినా మొద్దుగా ఉన్నా కాస్తమెరుగుగాఉండును, చీకూచింతాలేకుండా హాయిగా ఉండవచ్చు! ఒకప్రక్క పూర్వజన్మజ్ఞానముండి, ఇది లేదు ఇది కావాలె అనిపిస్తుంది. ఆకోరికలు తీర్చుకునే సాధనాలు లేవాయె!

తీరనికోరిక ఉండడంకంటె నరకమేమిటి? ఎక్కడికన్నా ఆడుకోడానికి పోవాలనుకుంటే నీపెంపుడుతల్లి గుంజకు కట్టేసిందనుకో! నీ కప్పుడెట్లా ఉంటుంది?

ఎవరన్నా నిన్నన్యాయంగా కొట్టారనుకో!—అది మాష్టరుకు రిపోర్టుచేయబోతూ ఉంటే, నోరు ముయ్యి కూచో,—అంటే నీకెట్లా ఉంటుంది?

సరిగ్గా గుడ్డులో బ్రతుకుకూడా అట్లాగే నరకకూపంలాగ ఉంటుంది. దీన్నే కాబోలు గర్భనరకం అంటారు!

ఎట్లాగైతేనేమి, వాళ్లంతా గర్భనరకంలోనుంచి బయటపడ్డారుగా! ఇప్పుడు వెనక మనస్సు తిరిగినట్లు లోకాలన్నీ తిరగలేకపోతే ఏమి? కాస్తోకూస్తో ముందుకూ వెనక్కూ ఆ పక్కకూ ఈపక్కకూ కదలవచ్చు మునపటివలె ఎక్కడఉన్న వస్తువులైనా మనస్సుతో చూసేశక్తి లేకపోతేఏం? ఎదట ఉన్న కాసిని వస్తువులూ కళ్లతో శుభ్రంగా చూడవచ్చు ఇప్పుడు! ఎన్నోఊహలు కడుపునిండా ఉండికూడా వెనకటి మూగబ్రతుకుకంటె కడుపులోకి వచ్చిన కాసిని ఊహలూ కా అంటూ కూ అంటూ కూసుకోవచ్చు! గుడ్డులోబ్రతుకు గుడ్డిబ్రతుకు!

దానిలోనుంచి వాళ్లు బయటపడ్డారు. కాళ్లూ రెక్కలూ విదిలించుకొని సాగదీసుకొని హాయిగా



గూడెంలో కాకులన్నీ పోగైనై. ఒకరిమాట ఒకరు వినిపించుకోకుండా రణగొణధ్వని చేస్తున్నవి.

విచ్చుకొని కిచకిచమన్నారు. ఒంటిమీద గాలిపారి ఒళ్లు తడి ఆరింది.

వాళ్లందరికీ అప్పుడు ఒకేవిధమైన కొత్తఅనుభవంకలిగింది గుడ్డులో ఉండగా అది లేదు. ఇప్పుడొక తపన——ఆవేదన—పుట్టుకొని వచ్చింది. దాన్నే ఆకలిఅంటాము.

ఎనిమిదిమందికీ అనుభవము ఒకటే అన్నాము గనుక వాళ్లందరి ఆకారం ఒకటే అనిగాని, అంతా ఒకటేచోట ఉన్నారని కాని అనుకోరాదు. ఎనిమిదిమందీ ఎనిమిదిచోట్ల పుట్టారు.

మంత్రీ మంత్రిభార్యా హంసలైనారు. రాజూ రాణీ నెమిళ్లైనారు. కోశాధిపతీ భార్యా చిలకలైనారు. గాయకుడూ భార్యా కోకిల లయినారు. మానససరోవరందగ్గర ఒకజంటా, శ్రీశైలంలో ఒకటీ, భద్రాచలంలో ఒకటీ, సింహాచలంలో ఒకటీ!

వారిలో మొదటి ఆరుగురికీ చిన్నతనంలో వాళ్లవాళ్ల తలిదండ్రులచాటున మొత్తంమీద సుఖంగానే గడిచిపోయింది. చివరవాళ్లిద్దరూ చిన్నతనంలో పడ్డబాధ ఇంతా అంతా అని చెప్పలేము.

## 23

పాపం పూర్వగాయకుడి అవస్థ గుడ్డులో ఉండగానే ఆరంభమయింది. అతడెక్కువ బాధపడ్డది కళ్లూకాళ్లూ లేవని కాదు. అతని మనస్సులో నాదమెంతో ఉబికిపడుతున్నది. అది పట్టలేకున్నాడు. అయితే నోరేదీ?

# ★ కర్పూరద్వీపయాత్ర ★

కడుపులోమాట మన మేలుకోరే ఆప్తులకు చెప్పకోకుండా ఉండడం ఎంతకష్టం? నీకు క్లాసులో ఫస్టుమార్కు వచ్చిందనుకో, చక్కనిబహుమతి ఇచ్చారనుకో! ఆసంగతి ఇంటికి వెళ్ళి అమ్మకూ పెద్దక్కకూ చెప్పినదాకా, చెల్లాయికి బహుమానం చూపించినదాకా, నీకెంత ఆరాటంగా ఉంటుంది? పాపము వాడికి కిందటి జన్మలోపాడిన సంగీతమంతా ఇప్పుడు ఆనందతరంగాలవలె పొంగిపడుతున్నది. ఒక్కస్వరమూ అనలేక మూగవారి పోయినాడు!

ఎట్లాగో చివరకు గుడ్డులోనుంచి బయటపడ్డాడు. అప్పటినుంచీ వాడికి మరోరకం అవస్థవచ్చి పడ్డది.

వాళ్లమ్మకు కనడమేకాని గుడ్డును పొదగడం చేతకాదు—పిల్లలను సరిగా పెంచలేని తల్లులెందరు లేరు? వాళ్లల్లోనే! అందుకని అతనిగుడ్డు నది ఒకకాకిగూటికి తీసుకుపోయింది. అక్కడ రెండుకాకి గుడ్లున్నాయి. దొంగతనంగా అందులో ఒకదాన్ని ముక్కుతో చెట్టుకిందికినెట్టి అక్కడ తనగుడ్డుపెట్టి పారిపోయింది.

కాకమ్మమాత్రము అజాగ్రత్తగా ఉందా? దూరానఉండి తన గూటిదగ్గరకు కోకిలమ్మవచ్చి పోవడం చూడగానే పరుగెత్తుకువచ్చి కోకిలమ్మవెంటపడ్డది. కోకిలమ్మ చిక్కకుండా తప్పించుకున్నది.

గూటికివచ్చి కాకమ్మ చుట్టుపక్కలంతా పరీక్షచేసుకుంది. తోటికాకులను పిలవగా అన్నీ వచ్చి గోడవచేసినై. చెట్టుకిందబడ్డ గుడ్డు వాటికళ్లపడ్డది. కాకమ్మకు రౌద్రావేశం వచ్చింది.

"చూశారుటేవ్? కోకిలామ తనగుడ్డు మనగూట్లో పెడదామని తెచ్చి తొందరలో కిందపడేసుకొని పోయింది. ఇట్లాగే శాస్తి కావాలె!"

ఇట్లా అంటూ కోపంతో, కిందపడి అప్పటికే విచ్చుకుపోయిన తనగుడ్డునే, కోకిలదనుకొని, పొడిచి పొడిచి పిప్పిచేసింది.

కోపంకాస్త శాంతించిన తర్వాత పొంగుతూన్న ప్రేమతో తనగూడు వచ్చి చూసుకుంది. రెండు గుడ్లూ ఉన్నైగాని అందులో ఒకటి రవ్వంత మార్పుగా ఉంది. అది కొంచెముచిన్నదా అనికూడా అనిపించింది. తల్లిప్రేమ కనుక ఎట్లాగో సరిపెట్టుకున్నది.

ఈ కథంతా కోకిలగుడ్డుమాత్రము చూసిందనుకున్నారా? ఎబ్బే! గుడ్డుకు చూసే కళ్లుంటేగా!

## 24

ఎట్లాగైతేనేమి, సంగీతంతో కడుపులో కుమిలిపోయి కుమిలిపోయి కాకమ్మరెక్కల వెచ్చదనం వల్ల పొదగబడి గుడ్డులోనుంచి అది బయటపడ్డది. దానితోపాటే, కాస్తముందూ వెనకగా కాకిపిల్లకూడా బయటికి వచ్చింది.

ఆరెండూ తమ పిల్లలే అనుకున్నవి కాకీ, కాకమ్మా ఐతే కోకిలపిల్ల రెండవదానికంటె చిన్నది. దానిముక్కు చిన్నది. రెక్కలుకూడా చిన్నవి. రంగుకూడా నాజూకు నలుపు.

దాన్ని చూడగానే కాకీ కాకమ్మా దిగులుపడ్డారు. "అయ్యో! మన కడుపున ఎంత అర్భకపు పిల్లవాడు పుట్టాడు! వీడసలు బ్రతికేనా?" అనుకున్నారు.

ఇక దానికూత విన్నతర్వాత ఆకారము చూచినప్పటికంటెకూడా వాటికి విచారం ఎక్కువైనది. ఎక్కడో గొంతులోనుంచి స్వరం పెకలించుకొని కూ అంటాడు. అది ముందు కనిపెట్టింది కాకమ్మే. దానికి పైప్రాణము పైన లేచిపోయినట్లయింది. "అయ్యో! ఇట్లా కడుపులోనుంచి పెకల్చుకుంటేకాని గొంతు వినపడడంలేదు, పేగులుఊడిపడి ప్రాణాలు పోవుగదా!" అనుకున్నది.

అది వాణ్ణి బుజ్జగించి, 'నావలె చక్కగా కా అను నాయనా,' అంటూ అరిచి చూపెట్టింది.

పాప మా కోయిలపిల్లవాడు ఎంతప్రయత్నించినా కా అనలేకపోయినాడు. వాడితోపుట్టిన కాకి



మూడు ఎక్స్‌పోజర్సులో చంపకవల్లి 1 మోడీభంగిమ, 2 కృష్ణుడు, 3 చెంచు.

★

"మోడీనాట్యం" చంపకవల్లి, రాజేశ్వరి — ఫొటోలు : వి. తంబి, కర్నూలు.

# కర్పూర ద్వీపయాత్ర

పిల్లకూడా వాడివైపు చూస్తూ తలఎత్తి, 'కా ఆఆ కా ఆఆ,' అని అరిచిచూపుతుంది.

వాడూ అట్లాగే అనబోయి 'కుహూ' అంటాడు. సాటి కాకిపిల్లనవ్వుతూ, 'అయ్యో, నేనెంత బాగా అంటానో చూడు, 'కా ఆఆ కా ఆఆ' అంటుంది. వాడు కళ్లనీళ్లు పెట్టుకుంటూ ప్రయత్నించి కుహూ అంటాడు. కాకమ్మ చూసి జాలిపడుతుంది.

ఇదంతా చూస్తున్నతండ్రి కాకికి కోపమువస్తుంది. "పండంటి మా కాకి వంశంలో చెడబుట్టావు!" అంటూ కవిసికవిసి అరుస్తూ పొడవబోతుంది.

కాకమ్మ అడ్డంవస్తుంది. "అయ్యో బాగానే ఉంది. పసివాడు గొంతు సరిగ్గా రాక అసలే అరవ లేకుండా ఉంటే పైగా పొడవవస్తావు, ఊరుకో!" అంటుంది

తండ్రి కాకి కోపం పట్టలేక, "పాపిష్టిముండా!" అని తిడుతూ కాకమ్మను పొడుస్తుంది.

పోట్లాటలో కాకమ్మ వెనకాడదు—అది ఎమెజాను రాణివలె ఎగిరి కాకివాణ్ణి పొడుస్తూ, "నా పిల్లలజోలి ఎత్తావంటే నాగూట్లోకి కూడా రానీయను కపడ్దార్!" అంటూ రాకాసిగొంతుతో అరుస్తూ ఒక్క తన్నుకూడా తన్నింది.

అంతలో గూడెంలో కాకులన్నీ మూగి స్వంతజాతి సంగీతం పాడుకుంటూ చుట్టూచేరి తలోమాటా మాట్లాడినై. మొత్తంమీద ఆడకాకులన్నీ ఒకటేమాట! వాటిధాటికి నిలవలేక తండ్రికాకి నోరుమూసు కొని ఆపూటకు ఒదిగి దాసుడై గూట్లో చేరుకుంటూ, మొత్తంమీద బింకం వదలక "ఈమాటు వాడికి ఆక లైనప్పుడు కా అననిది అన్నంపెట్టిచూడు, ఏంజేస్తానో!" అన్నది

కోకిలపిల్లవాడికి ఆకలివేయనేవేసింది. కడుపులో భగ్గుమంటున్నది. కా అంటేకాని తల్లీతండ్రీ అన్నము పెట్టరని దిగులుతో తనలోతాను మనస్సులో కాకాఅని గుణించుకొని తీరా చివరకు కూ అనేశాడు.

ఈమాటు కాకమ్మకే కోపంవచ్చి వాణ్ణి ఒక్కపోటు పొడిచింది. ఆపోటుకు నిలవలేక వాడు వెల్లి కిలా పడిపోయినాడు. తండ్రి కాకి తిట్టుతూ అవతలికి పోయింది. అప్పుడు మళ్లీ కాకమ్మకే జాలివేసి పడ్డపిల్ల వాణ్ణి లేవదీసి ఏడుస్తూ ఓదార్చి ముక్కుతో అన్నంపెట్టింది.

సాటి కాకిపిల్ల హుషారుగా కాకా అంటూంటే వీడికి ఉక్రోశంకూడా కలుగుతుంది. లోపల కుళ్లుకుంటాడు.

రోజూ యిదే తీరు! కాకిపొడవనూ, కాకమ్మ పొడవనూ, ఆరెండూ పోట్లాడుకోనూ, గూడెంలో కాకులు పోగుకానూ! మధ్యమధ్య సాటి కాకిపిల్లకూడా తన్నడం సాగించింది—పారం అప్పగించుకోనే మానిటరువలె!

పాప మాకోకిల పిల్లవాడికి ఒకటేదిగులు—ఈ కాలంలో కొందరు సత్కవులకువలె—అమ్మవలె నాన్నవలె అక్కవలె అందరివలె చక్కగా కా అననేలేమా అని. అయ్యో, భగవంతుడా, నాకా కూత ఇయ్యరాదా అని ఏడుస్తాడు. ఎవరన్నా పొడుస్తే, తప్పుచేసిన పిల్లవాడు దెబ్బలుతిన్నట్లే, కోపంలేకుండా ఏడుస్తాడు. ఆదెబ్బలైనా తినే బలమూలేదు వాడికి!

రోజులు గడిచినకొద్దీ మరొక చిక్కొచ్చింది. మొదటమొదట దెబ్బలు తింటూనే ఆకలికి ఆగలేక కాకమ్మ ఏదిపెట్టినా తింటూవచ్చాడు. ఎదుగుతున్నకొద్దీ కాకులు తినే కుళ్లినమాంసమూ నానాతిండీ వాడి నోట్లో పెడితే డోక్కుంటున్నాడు.

"చచ్చువెధవకు సూకరాలు కూడాను!" అంటుంది తండ్రికాకి.

ఒకనాడు కోకిల ఆకలిపట్టలేక మామిడిచెట్టుమీద వాలి దానిఇగుళ్లు తినడం చూసింది తండ్రికాకి!

ఏముంది ఇక! వెంటనే అది కాకమ్మతో తగూవేసుకుంది. గూడెంలో కాకులన్నీ పోగైనై ఒకరి

మాట ఒకరు వినిపించుకోకుండా రణగుణధ్వని చేస్తున్నవి. అవన్నీ సభచేసి ఏకగ్రీవంగా సంగతి తేల్చివేసినవి.

"కాకమ్మా, అనవసరంగా పోట్లాడబోకు! ఏదో దొంగకోకిలామె తనగుడ్లు నీగూట్లో పెట్టి పోయింది కాని వీణ్ణి వదులుకో! కాకి కాదమ్మా, కోకిలాయ!"

కాకమ్మ ఒప్పుకోలేదు. "నేను కళ్లారా చూశాను. కోకిలగుడ్డు కిందపడితే నాముక్కుతోనే పొడి

# ★ కర్పూర ద్వీపయాత్ర ★

చేశాను. వీడు నాసొంతపిల్లవాడు. ఏదో జబ్బుతో అట్లా వాడు ఏడుస్తూఉంటే, పైగా మీరంతా తీర్పు వచెప్పచ్చారా!—పిల్లలు కన్నవాళ్లేనా?" అన్నది.

సభాపతి జోక్యం కలిగించుకున్నాడు. "కాకమ్మా, చూడు వాడిముక్కు! వాడిరంగు చూడు! వాడి తీరుచూడు, తిండిచూడు! వాడి కూతచూడు—అంతా అచ్చంగా విధవకోకిలే. మనమధ్య పనికి మాలిన కోకిల నిలవరాదు!"

సభాపతి తీర్పు చెప్పగానే గూడెంలో కాకులన్నీ రొదచేస్తూ కోకిల ఉన్నమామిడిచెట్టును చుట్టు ముట్టినవి. భయంతో గజగజ వణికిపోతూ కోకిలపిల్లవాడు ముదురాకుల మాటున కనబడకుండా దాక్కున్నాడు. కాకులన్నీ వాడికోసమై కొమ్మకొమ్మనా ఆకు ఆకునా గాలిస్తున్నయి ఆపూట కోకిల చావుమూడేదే!

కాకమ్మ ఊరుకొన్నదా? అట్లాచుట్టు ముట్టిన కాకులను కొన్నిటిని పొడిచింది. కొన్నిటిని తన్నింది. కొన్నిటిని రెక్కలార్చి బెదిరించింది. కొన్నిటిని బతిమాలుకున్నది. కొన్నిటిని తరిమి వేసింది. అట్లా ఆ ఒక్క కాకమ్మ అన్నిటితోనూ ఏకాంగవీరుడివలె యుద్ధంచేసింది. దాని ఒళ్ళంతా గాయాలే. ఈకలు రాలినై. సొమ్మసిలిపోతున్నది. ఏడుస్తున్నది. గొంతు బొంగురుపోయింది.

అదృష్టవశాత్తుగా అప్పుడు బాగా చీకటిపడ్డది. గూడెంలో కాకులానాటికి వాటిని వదిలిపెట్టి గూళ్లలో చేరుకున్నవి.

ప్రమాదం తప్పిపోయినదని ధైర్యము వచ్చినతర్వాత కోకిలపిల్లవాడు ఆకులమాటునుంచి వచ్చి కాకమ్మను కౌగిలించుకొన్నాడు. కాకమ్మకూడా వాణ్ణి గట్టిగా కౌగిలించుకొన్నది. బావురుమని ఇద్దరూ ఏడ్చారు. బాగా పొద్దుపోయేవరకూ ఇద్దరూ అట్లాగే కాగలించుకొని ఏడుస్తున్నారు.

అర్ధరాత్రి అయింది. ఇట్లా ఏడుస్తూ కూచుంటే లాభంలేదు. తెల్లవారితే మిగిలిన కాకులు గూడెంలో తనబిడ్డ కనబడితే బతకనీయవు. అడ్డంపోతే తనప్రాణంకూడా దక్కదు. ఈరాత్రే తన ముద్దుల పిల్లవాణ్ణి దూరంగా తీసుకొనిపోయి వదిలిపెట్టాలి.—ఇట్లా కాకమ్మ ఆలోచిస్తూ జ్ఞాపకానికి తెచ్చుకుంటున్నది. దూరంగా అడవిలో పెద్దమామిడిచెట్టు ఉన్నదని గుర్తుతగిలింది.

కాకమ్మ ఆ పిల్లవాణ్ణి తీసుకొని బయలుదేరి కాకులకంట కనబడకుండా గూడెం దాటించింది. అప్పుడిక ధైర్యంచేసి తాను ఎగురుతూ పిల్లవాణ్ణికూడా తనతోపాటుగా ఎగిరి రమ్మన్నది.

చిత్రం చూచారా? కాకమ్మకంటెకూడా వాడే బాగా ఎగురుతున్నాడు. ఒళ్లు చిన్నదే ఐనా వాడి రెక్కలు తగ్గట్లు బలంగా ఉన్నవి.

ఎట్లాగైతేనేమి, వాళ్లిద్దరూ ఆ దూరపు అడవిలో మామిడిచెట్టు చేరుకున్నారు. ముద్దుపెట్టు కున్నారు. ఏడ్చారు.

"నాయనా, ఇక నీదారిన నీవు ఎట్లాగో బతుకు!"అంటూ పిల్లవాణ్ణి దీవించి కాకమ్మబయలుదేరింది.

కాస్త దూరముపోయి విడిచిపోలేక మళ్లీ వెనక్కువచ్చి పిల్లవాణ్ణి గట్టిగా కౌగిలించుకొని ముద్దు పెట్టుకొని దీవించి బయలుదేరింది.

ఈమాటు మళ్లీ మరి కొంతదూరముపోయి ఉండబట్టలేక మళ్లీ వెనక్కు వచ్చి కౌగలించుకొని ముద్దు లాడి ఏడ్చింది.

ఇట్లా కాకమ్మ వెళ్లుతున్నది. వస్తున్నది.

రాత్రి మూడు జాములైనది. తాను మళ్లీ తిరిగివస్తే పిల్లవాడికి ఇక తక్కిన కాకులచేతుల్లో బతుకుమీద ఆశఉండదని కాకమ్మ నిశ్చయం చేసింది. గుండె రాయి చేసుకున్నది. మళ్లీమళ్లీ ఆవైపే వెనక్కుతిరిగితిరిగి చూస్తూ కాకమ్మ గూడుచేరుకొని సొమ్మసిలి పడిపోయింది.

తండ్రికాకీ కాకిపిల్లా కాకమ్మచుట్టూ ఎగురుతూ ఒకటే కాకిగోల చేస్తున్నవి. [ఇంకా ఉన్నది]



# ఎందుకు...ఏమిటి!



## సముద్రపు నీళ్ళు ఉప్పన

మన పూర్వీకుల నమ్మకాల ప్రకారం ఏడురకాల సముద్రాలుండేవి. వీటిని సప్తసముద్రాలంటారు. లవణసముద్రం, పాల సముద్రం, చెరుకురసపు సముద్రం ఇలాగ వివిధరుచులు కలిగిన సముద్రాలు ఏడు ఉండేవట. అవి పురాణాలు వ్రాసినవాళ్లు కల్పించిన కట్టుకథలు అనడంలో సందేహంలేదు. ఒకవేళ నిజమైనా, ఈరోజుల్లో మాత్రం ఏ సముద్రం నీళ్ళు తీసుకున్నా ఉప్పగానే ఉంటున్నాయి. ఒక్కచుక్క నోట్లో వేసుకుంటే చాలు అయిదునిమిషాలదాకా నోరు ఎందుకూ పనికిరాదు. అంత కటిక ఉప్పగా ఉంటాయి.

అయితే సముద్రంనీళ్లు ఎందుకంత ఉప్పగా ఉంటాయి?

వాన కురిసినప్పుడు కొంత నీరు భూమిలోకి ఇంకిపోతుంది. ఎక్కువ నీరు భూమిపైనేఉండిపోయి ఏరులై, నదులై ప్రవహిస్తుంది. మట్టిలోను, రాళ్ళలోనూ కొంచెం ఉప్పుకూడా కలిసిఉంటుందనేది అంతా ఎరిగిన విషయమే. ఈ ఉప్పు నదీజలంలో కరిగిపోయి సముద్రాలకు ప్రయాణంచేస్తుంది. అంటే సముద్రంలో కలిసే ప్రతినదిలోను కొంచెం ఉప్పు కూడా ఉంటుందన్నమాట. అయితే ఉప్పగా ఉందనిపించేంత ఉండదు; అతి స్వల్పంగానే ఉంటుంది.

ఇలా తనలో కలిసే ఉప్పునంతటినీ సముద్రం తనలోనే దాచుకుంటుంది. సూర్యరశ్మికి సముద్రపు నీరు ఆవిరియై పైకెగసిపోతుంది. కాని ఉప్పుమాత్రం సముద్రంలోనే ఉండిపోతుంది. ఈలోగా నదులు మరి కొంత ఉప్పు చేరవేస్తాయి. ఇలాగ ఎప్పటికప్పుడు కొత్తఉప్పు వచ్చి చేరడమే తప్ప పాతఉప్పు పోవడం లేదుగనక, అంతకంతకి సముద్రంలో ఉప్పెక్కువ అయి కటిక నీళ్లు తయారవుతాయి. ఇలా ఎన్ని లక్షల ఏళ్లనుంచీ జరుగుతోందో మరి? అందుకే సముద్రంనీరు అంత ఉప్పన.

"ప్రతివాది నిన్ను ఏమన్నాడో సరిగ్గా అవే మాటలు చెప్పగలవా?" అని అడిగాడు లాయరుగారు వాదిని.

"అబ్బే! చెప్పలేను. అలాంటి మాటలు మనబోటి వారు బిగ్గరగా అననైనా అనరాదండి!"

"పోనీ — జడ్జిగారికి చెవులోనే చెప్పవయ్యా!"-కసిరాడు లాయరుగారు.

*  *  *

"ఏంసోదరా! నిన్న సాయంకాలం బీచిలో నీ పక్కనున్న వంకజాతి ఎవరేం!"

"నేను చెప్పను,"

"చెప్పేదూ!"

"మా ఆవితో చెప్పకుండా వుంటానంటే చెప్తాను."

"చెప్పనులే; చెప్పు"

"అయితేవిను—మా ఆవిడే!"

—రామారావు, మద్రాసు.

సినిమా చూస్తున్న ఒక ప్రేక్షకుడు ఒక నటుడి నటన చూసి మెచ్చుకుంటూ "టిపికల్! టిపికల్!" అని బిగ్గరిగా అన్నాడు.

కొంచెందూరంలోకూర్చున్న మరొక ప్రేక్షకుడు "ఏమిటిది, అప్పుడే గవర్నమెంటువాళ్ళు 'నీరా' అమ్ముతున్నారేమిటి తిపికల్లు, తిపికల్లు అని విని పిస్తోంది?" అన్నాడు.

నండూరి సుబ్బారావు - అరుగోలను.

*  *  *

నౌకరు: అయ్యా, డాక్టరుగారొచ్చారు?

మందమతి ప్రొఫెసరు: నాకు జ్వరంగా ఉంది. ఇప్పుడెవరినీ చూడడానికి వీల్లేదని చెప్పు.

—ప్రతాపరావు. విశాఖపట్నం.



ఆనందావారి 'మేలుకొలుపు'లో జి. వరలక్ష్మి.



హరిశ్చంద్ర పిక్చర్స్‌వారి హిందీ చిత్రం "ధర్మపత్ని"లో విరూపరాయ్, మహీపాల్.

# అదీ - ఇదీ

ఎన్నార్

జనతావారి "పరివర్తన" షూటింగ్ వాహినీ స్టూడియోలో చురుగ్గా సాగుతోంది దాదాపు సగం తయారైంది ఈ చిత్రానికి ఆధారం పినిశెట్టి వ్రాసిన "అన్నా చెల్లెలు" నాటకం దానిలో కొన్ని మార్పులుచేసి కథ తయారుచేశారు. ఎ నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు ఇద్దరూ చాలకాలం తర్వాత ఈ చిత్రంలో కలుసుకుని ముఖ్యపాత్రలు నిర్వహిస్తున్నారు.

ఆ రోజున జమీందారు భవనం సెట్ పై షూటింగ్ జరుగుతోంది. చనిపోయిన జమీందారు దత్తపుత్రుడు ఆనందరావుగా ఎన్ టి రామారావు, జమీందారువద్ద చాలకాలం నమ్మకంగా పనిచేసిన దివాన్ కొడుకు సత్యంగా నాగేశ్వరరావు ముఖాముఖీ సంభాషిస్తున్నారు. "నేను ఇంటర్మీడియెట్ ప్యాసయ్యాను ఆనర్సు చదవాలని ఆశ మీ రేదైనా సహాయం చెయ్యాలి," అని సత్యం ప్రాధేయపడ్డాడు. "ఛీ, ఛీ, నీకా సహాయం? అందరికీ సహాయం చేసే మీ నాన్న ఉన్నాడుగా? నా సహాయం దేనికి?" అని ఆనందరావు కసిరికొట్టాడు. సత్యం రోషంతో 'నిన్నడగడం నాదే తప్పు' అని వెళ్ళిపోతాడు. ఈ దృశ్యంలో సారాంశం ఇది. వీరిరువురినీ, కామెరా పక్కన కుర్చీలో కూర్చున్న తాతినేని ప్రకాశరావు గారు డైరెక్టు చేస్తున్నారు. కొన్ని రీ టేక్ల తర్వాత ఒక ఓ కే షాట్. తర్వాత ఇంకొకట ప్రారంభం ఈమధ్య విరామ సమయంలో ఇద్దరు నటులతోను మా ఇష్టాగోష్ఠి.

"మా వారపత్రిక మీరు చూస్తున్నారా?" అని అడిగాను.

"చూస్తున్నాను. మీ పత్రిక నడిచే పద్ధతిపై నాకు చాలా గౌరవం ఉంది," అన్నారు నాగేశ్వరరావు

"మా సినిమా సమీక్షలపై మీ అభిప్రాయం ఏమిటి?"

"నిష్పాక్షికంగా, సహేతుకంగా ఉంటున్నాయని నా నమ్మకం"

"ఒక చిత్రంలోని గుణదోషాలను నిష్పాక్షికంగా, సహేతుకంగా విమర్శించినా నిర్మాతలు, తదితరులు సహృదయతతో స్వీకరించడం లేదని మా అనుమానం మీరేమంటారు?"

రామారావు అందుకుని "సినిమా పరిశ్రమపై సానుభూతితో చేసే నిష్పాక్షిక విమర్శలకు ఎవరూ నొచ్చుకోరని నా అభిప్రాయం. నామటుకు నేను నా నటనలోని గుణదోషాలను మీరు సహేతుకంగా చూపించినప్పుడు నా భవిష్యత్తుకు సహాయకారులయ్యారని సంతోషిస్తాను గాని నొచ్చుకోను వ్యక్తిగత దోషారోపణలతో నిమిత్తంలేని విమర్శలను నేను గౌరవిస్తాను. రామారావును రామారావుగానూ, నాగేశ్వరరావును నాగేశ్వరరావుగాను దూషించ ప్రారంభిస్తే మాకు కష్టం కలగడంలో ఆశ్చర్యం లేదు మేము ధరించిన పాత్రలకు ఎంతవరకూ న్యాయం చేశాము, ఎంతవరకూ అన్యాయం చేశాము అనేది తూచి చెప్పగలిగినప్పుడు అది ఎవరి విమర్శఅయినా మేము స్వీకరిస్తాము," అన్నారు

ఇంతలో నాగేశ్వరరావు కల్పించుకుని ఇలా అన్నారు: "అసలు చిత్రం విజయం పొందడం, పొందలేకపోవడం నటీనటుల ఒక్కరిమీదనే ఆధారపడి ఉండదు అనేక ఇతర కారణాలుకూడా కలుస్తాయి గొప్ప విజయం పొందిన "బాలరాజు"లో నేనేమి నటించింది, "దేవదాసు"లో ఏమి నటించింది, "కన్నతల్లి" లో ఏమినటించింది నాకు బాగా తెలుసు. కాని ఒక్కొక్క సారి ఏ దర్శకుడూ, విమర్శకుడూ కనిపెట్ట లేని లోపాలు ప్రేక్షకులు కనిపెట్టడం జరుగుతూంటుంది. అతి స్వల్పవిషయాలలో మేము చేసిన పొరపాట్లు ఏ ప్రేక్షకుడో కనిపెట్టి ఉత్తరాలు వ్రాయడం మాకు బాగా అనుభవం అంతమాత్రాన ప్రేక్షకులు విమర్శనా దృష్టితో ప్రతి చిత్రం చూస్తారని నా అభిప్రాయం కాదు. మొత్తం చిత్రమంతా చూసి బావుంటే బావుందనీ, లేకపోతే లేదని ప్రేక్షకులు నిర్ణయించుకుంటారు. ప్రత్యేకంగా విమర్శనా దృష్టితో చిత్రం చూసేది జర్నలిస్టులూ, విమర్శకులు. ఈ బాధ్యత నెరవేర్చే వారి విమర్శలపట్ల మాకు గౌరవమే తప్ప మరోటిలేదు. మీ వారపత్రిక అలా చేస్తోందనే నా ఉద్దేశ్యం"

ఇంతలో మరొక షాట్‌కు ఏర్పాట్లు పూర్తయినందువల్ల ఇద్దరూ కామెరా ముందుకు వెళ్ళారు

నాగేశ్వరరావు ఇప్పుడు "పరివర్తన", అశ్వరాజ్ వారి "అన్నదాత", చిత్రాల్లో నటిస్తున్నారు. ఈ రెండు చిత్రాల్లోను ఆయన పాత్ర త్వరలో ముగియబోతుంది. తరవాత భరణీవారు తీయబోయే విప్రనారాయణ చిత్రంలో నాయక పాత్ర ధరించనున్నారు. విప్రనారాయణుడి వేషానికి మీరు కేశఖండనం చేయించవలసివుంటుందా అని ధూర్తిగా అడిగా "లేదు బహుశా కాంత్ జూనేశ్వర్ హాటల్ లో తయారవుతాను," అన్నారు నాగేశ్వరరావు

ఈయన అంజలీ పిక్చర్సు తీయనున్న "అనార్కలీ"లో సలీం వేషం ధరించనున్నారు. త్వరలో వీరంతా ఆగ్రా వెళ్ళి ఫతేపూర్ సిక్రీ, యమునా నది మొదలైన లొకేషన్ దృశ్యాలు షూట్ చేసుకుని వస్తారట. ఈ చిత్రానికి వేదాంతం రాఘవయ్యగారు దర్శకులని పాఠకులకు విదితమే.

పి. పుల్లయ్యగారు (రాగిణీ) తీయ



'రూపకళాకేంద్ర'వారి ఆరవ వార్షికోత్సవసభలో, బొంబాయి, జైహింద్ కాలేజీహాలులో తెలుగు బాలికలు శిష్టా సోదరీమణులు కోమల, లక్ష్మి భరతనాట్యం చేశారు. వీరు శ్రీ॥ శ్రీ॥ శిష్టా వెంకటరావుగారి కుమార్తెలు. ఈబాలికల కౌశలము భారత కార్మికమంత్రి వి. వి. గిరి ప్రశంసించారు.



విక్రమ్ ప్రొ॥ వారి తొలిచిత్రం "మాగోపి" ప్రారంభోత్సవ సందర్భంలో తీసినఫొటో కూర్చున్నవారు స సీతారామ్ (ఫ్లార్టా), రంగస్వామి (రేవతీ), సంపత్, ఎ నాగేశ్వరరావు, వి. ఎస్ రాఘవన్ (రేవతీ)గార్లు నుంచున్నారు బి. ఎస్. రంగా (దర్శకుడు, నిర్మాత, కొమెరామాన్) డి. ఎల్. నారాయణగార్లు.

వ్వించిపోవటమూ ప్రధానంగా జరుగు తోంది.

చావు భయం పట్టుకొనేదాకా, పర మేశం ఎలాగైతే జీవితంమీద తేలుపోతూ, ఎంతసేపూ తన స్వార్థమూ, తమ తోడు దొంగల లాభమూ మాత్రమే ప్రధానంగా మాసుకొంటూ వచ్చాడో, అలాగే మన తెలుగు సినిమా పరిశ్రమకూడా మొన్న మొన్నటివరకు ఎంతసేపూ గృహకల్లోలాలు, యువతీ యువకుల ప్రేమవిలాసాలు, లేదా వూహాలోకాల్లో జరిగే అనూహ్య కథా సంవిధానాలు మాత్రమే ప్రధానమై నట్లూ, అవి తప్ప వేరే జీవితమే లేనట్లూ బతుకుతూ వచ్చింది; ఈమధ్య అంత పెద్ద కొయిలాపడి లేవటంతో యిప్పుడు కొత్త కళ్ళు తెరిచి నాలుగు వేపులా చూస్తోంది. మన చుట్టూ ఎన్నెన్ని రకాల సమస్యలుం వున్నాయో యీ పరిశ్రమకి యిప్పుడు లీలగా అయినా అపుపిస్తున్నట్లున్నది. మెచ్చుకోదగ్గ మరొక మంచి లక్షణం ఏమి టొచ్చిందంటే – ప్రేమ, ప్రణయం, చంద మామ, విరహగీతం యిలాంటి బజారు సరుకు వాడకం పూర్తిగా తగ్గిపోయింది. ఈ నాలు గైదు సాంఘిక చిత్రాలలోనూ అక్క డక్కడా కొద్దిగా వాటి వూసువచ్చినా, అది ప్రధానమైనట్లుగా మాత్రం రాలేదు. అంతమటుకు అది నిజంగా సంతోషించ వలసిన విషయమే. మొత్తానికి 'తోడు దొంగలు' కూడా మాశాక, సినిమా పరి శ్రమకి స్తబ్ధతనం వదిలిపోతున్నదన్న ఆశ నాకు మరీ బలంగా కలిగింది.

ఈ సినిమా నాలో యింకో ఆశను కూడా కల్పించింది. అదేమిటంటే— రాజధాని ఛాన్సుపోయి విచారిస్తున్న విజయ వాడకు మంచి సినిమా ఛాన్సు దొరికింది. ఇటీవలవచ్చిన 'యిరుపేదల్లోనూ, 'తోడు దొంగల్లో'నూ విజయవాడకు బుకింగ్ దొరి కింది (అన్నట్లు-విజయవాడకి కొంతకాలం క్రితం 'నాయిల్లు'లో చిన్న వేషం దొరికింది. కాని మేకప్ మారిపోయి అసలే గుర్తు పట్ట లేకపోయాం,) ఇలాగే మరి కొంతకాలం గడిచి, మునిసిపల్ పాలిటిక్సు ముదిరి పోవటంలాటి దేదో ఆవూళ్లో జరిగిందంటే, రానున్న కాలంలో యీ విజయవాడే ఏదో ఒక సినిమాలో హీరోగా బుక్ ఐపోయినా ఐపోవచ్చు. దేవుడు యింకొ చాలా మేలు చేస్తే, ఆతరువాత కొద్దికాలంలో ప్రొడ్యూ సరుగా ప్రమోషన్ పొందినా ఆశ్చర్యపడ వలసిన అవసరంలేదు. (చిన్నప్పటినుంచీ చెన్నపట్నం సంగతి చూస్తూనే వున్నాం కదండీ: ఇంచుమించు ప్రతి సినిమాలోనూ



“పల్లెపడుచు”లో పిసినిశెట్టి శ్రీరామమూర్తి.

★ ★

చెన్నపట్నానికి ఛాన్సు దొరుకుతునే వుంది అది రాని సినిమా లేదంటే అందులో అతిశయోక్తి ఆట్టే లేదు.)

ఈ సినిమా మూలంగా ఒకటికి రెండు విషయాల్లో నాకు కించిత్తు ఆశ కలిగినా, మరొకందుకు పెద్ద దిగులు పుట్టుకొచ్చింది సినిమాలు వచ్చాక చంద్రుడికి కళంకం మటుకు పోయింది. తెరమీద కనుపించే చంద్రుడు కడుపులో మచ్చ పూర్తిగా కడిగేసుకొనిగాని సామాన్యంగా తెరమీదకు రాడు ఆకాశంలో కనిపించే చంద్రుడు అనేక ఆకారాల్లో వుండటం నేను ఎరుగుదును. 'కుక్కపిల్ల కొరికిన జొన్నముక్కలా' చందమామ ఉన్నాడని ఒకానొక కవి వ్రాయగా చదివాను. కాని కోడిగుడ్డులా కోసు తేలిన చంద్రబింబాన్ని వూహించటమూ, చూపించటమూ మొట్టమొదటిసారిగా యీ 'తోడుదొంగలు' సినిమాలోనే జరిగింది.

ఆనాడు ప్రబంధ కన్యలు తిని కూర్చుని పెట్టిన శాపనార్థాలు అన్నీ తిన్నప్పటికీ తలవంచుకు తిరుగుతున్న చంద్రుడు, యీనాడు యీ సినిమా మహేంద్రజాలకుల చేతుల్లోపడి యింకా ఎన్నిరకాల బాధపడనున్నాడో కదా అని నాబోటివాళ్ళకు దిగులుగా వుంది.

ఇంకొక విషయం - పరమేశానికి అయితే అనుకోకుండా వైద్యుడూ జ్యోతిష్కుడూ కలిసి ఏదో బెరుకు పెట్టటమూ, ఆ బెరుకు మూలంగా ఆ మనిషి మనస్సు మారటమూ జరిగింది. ఈరోజున ఫ్యాక్టరీల మేనేజర్లుగా వుంటూ, యితనికంటె ఎక్కువగా పరపీడనే పద్ధతిగా పెట్టుకు వ్యవహరిస్తున్నవారూ వున్నారు; పరపీడన అన్నది వ్యాపారరీత్యా ఎంతవరకు అవసరమో అంతవరకే చేస్తూ, మిగిలిన అన్ని విషయాలలోనూ కూలీలపట్ల మానవత్వం ప్రదర్శించేవారూ లేకపోలేదు. కాని పరమేశం కోవకిచెందిన వారి మనస్సులు మారాలంటే కనీసం తడవకొక కూలీ అయినా దుర్మరణానికి గురికావాలి. అథవా ఆ షరుతు సాధించినా, ఎంతమంది పరమేశంలా మారగలరనేది అనుమానమే. ఆమాటకొస్తే, యీ పరమేశంతోపాటు అన్నింట్లోనూ మొదటినుంచీ తోడుదొంగగా వ్యవహరించాడని చెప్పబడిన లోకనాథం (ఆ దొంగతనాల వివరాలు మనకి ఆట్టే ఎవరూ చెప్పలేదు) చివరి ఘట్టంలో తన మనస్సు మారదని మాటలతో అంటూ, చేతులతో ఫ్యాక్టరీ తాళాలు మారిపోయిన పరమేశం చేతుల్లో పెట్టడం జరిగింది. చివరి ఘట్టంలోకూడా అతని మాటకీ, చేతకీ పొంతన కుదరకపోవటం గమత్తుగావుంది లోకనాథంలాంటి పెద్దదొంగ మనస్సు మాటల్లోకాక, చేతల్లో మారాలంటే ఏం చెయ్యాలో యీ నిర్మాతలకే వూహింపరాని విషయమెంది కాబోలు! ఉంటారు మరి—ఎందరో మహానుభావులు; ఎందునా మారని ఘనులు!

విధి ఒక్కొక్కణ్ణి ఏరి కోరి వేటకుక్క వెంటాడినట్లు వెంటాడుతూ వుంటుండి. ఆ దయమాలిన దుర్విధిలాగే ఫ్యాక్టరీ మేనేజరు పరమేశంకూడా కూలీలందరిలోకీ ఒక్క రాముడినే ఏరి వాణ్ణి చచ్చేదాకా వెంటాడాడనిపిస్తోంది - చిత్రంలో కథ చెప్పిన విధానాన్ని బట్టి. విధిలా యీయన కూలీరాముణ్ణి వెంటాడితే, ఆ కూలీ రాముడు యీయనను దెయ్యంలా వెంటాడాడు పరమేశం నరకానికి వెళ్లితే అక్కడా వున్నాడు; స్వర్గానికివెళ్ళితే అక్కడికీ వచ్చాడు పరమేశం పాడుపనులు చేసినంతకాలం అతనికి కలలో నరకం కనిపించటం, ఒక్కటంటే ఒక్కటే

మంచి పని చేసిన మరుక్షణం స్వర్గంలో యీయనకోసం ప్రత్యేకించి అందమైన అమ్మాయిల డాన్సూ, గర్బా చేయటం బాగుంది. నిత్యజీవితంలో మంచిపని చేసిన ప్రతిసారీ ఆమాత్రం స్వర్గం, ఆమాత్రం అందం కళ్లల్లో కనిపిస్తుందంటే, మనుష్యులందరూ మూక ప్పుమ్మడిగా మంచిపనులే చేస్తారు అంతవరకు అది గ్యారంటి! అప్పుడు ప్రపంచంలో మంచి మరీ ఎక్కువైపోయి, వూపిరి సలపటం కష్టం ఐపోతుంది.

మన దేశంలో నాటకాలు బతికివున్న రోజుల్నుంచీ, పేకాట సీనులో పకోడీ లాంటి పిల్ల పాటపాడుతూ డాన్సు చేస్తూ టీ కప్పులు అందించటం పరిపాటిగా జరుగుతుండేది. కాని యీ 'తోడు దొంగ'ల్లో పేకాట సీనూ వుంది; అందులో పడవలసిన దినుసులన్నీ పడ్డాయి కాని, బోండాలాంటి బాలుడు భుజాలూ, నడ్డీ తిప్పుకొంటూ డాన్సు చెయ్యటం ఏం బాగా లేదు.

మొత్తంమీద 'తోడుదొంగలు' కొన్ని కొత్త ఆశలు కల్పిస్తోంది. సినిమా తీసే కాలం, అందుకు అయ్యే వ్యయం తగ్గించటానికి అవకాశం లేకపోలేదని ఋజువు చేస్తోంది ప్రేమ జోలికి పోకుండాను, కళ్లు జిగేల్‌మనిపించే ఆడతారల అంగవిన్యాసాల అవసరం లేకుండానూ సినిమా కథలు అల్లవచ్చుననీ, ఆవిధంగా యింతవరకూ ఏవేవైతే బాక్సు ఆఫీసు అవసరాలని ఎంచబడుతున్నాయో, వాటిలో చాలాభాగం అర్థంలేని అపోహలేననీ ఋజువు చేసింది ఏ సినిమా అయినా సరే అధమం పదిహేడు వేల అడుగులకు తక్కువ పొడివుంటే కుదరదనే అభిప్రాయాన్ని పారద్రోలింది.

—గుంటూరు గ్రామ కాపురస్థుడు.

# 'ల'కారంపై మమకారం

భరణీవారి 'చక్రపాణి' చూస్తూవుంటే నాకు ఒక చింత కలిగింది. సినిమాల ద్వారా వినోదం ప్రసాదించగల రచయితలు, నిర్మాతలు ఔచిత్య అనౌచిత్యాల్ని గమనించలేదా? అనుచితం అసభ్యం అయిన కథలు కథా సంవిధానాల ద్వారానే కాని వినోదం కలిగించలేనంతటి అసమర్థులా? దేశం ఇంత గొడ్డుపోయిందంటే నమ్మడం కష్టం.

ఏ ఇంగ్లీషు కథో తీసుకొచ్చి మాసికలు వేసి అంటగటారని వేరే వారు చెప్పనక్కర్లేకుండా తెలుస్తూనేవుంది- యాంకీబొమ్మల బుష్‌కోటులా. కాని వినోదానికి ఈ బుష్‌కోటుకంటె మార్గం లేదంటే, అది నిర్మాతలకే అవమానమనుకుంటాను.

అసభ్యం, అనుచితం అంటున్నానంటే, ఏవో మన పాతివ్రత్య ధర్మాలు మంటకలిసిపోయాయంటున్నానని ఎవ్వరూ భావించ



త-డి చిత్రం "సంగారి"లో ఒక సన్నివేశం

## 'ఆకారం'పై మమకారం

తక్కువరలేదు. అసలు ఏ ఆడది 'చక్రపాణి'లో మాలతిలా ప్రవర్తిస్తుంది? ఏ మగవాడు చలంలా, సారథిలా ప్రవర్తిస్తాడు?

ఇదంతా కట్టుకథ—ఇంతలోకే నీకెందుకు తెంగ అని ఎవరేనా అనవచ్చు. ఈ కట్టుకథలవల్ల పాడయ్యేవాళ్ళెవరూ ఉండరు. కాని అసలు నిర్మాతలు ఆశించిన వినోదం వికారంగా పరిణమించిందని మనవిచేస్తున్నాను

ఈ ప్రధాన దోషమే చిత్రంలో చాలా లోపాలకి కారణమని నా ఉద్దేశం. నాగేశ్వరరావు, అమర్‌నాథ్ ఎంత హాస్యంగా కులాసాగా నటించాలని ప్రయత్నించినా పూర్తిగా వెకిలిగా కనపడ్డానికి కారణం పాత్ర చిత్రణలో సారం లేకపోవడం. కథలో లేని సారం మనుష్యులలో ఎలా వస్తుంది? ఈ లోపాన్ని కప్పిపుచ్చుకోడానికి కథలో మనుషులందరూ వెకిలిచేష్టలెన్నో చేశారు. 'తిరుగుబాటుదారు' మాలతి తెలివీ,జిత్తులూ చూపించబోయి నేల తన్నుకుంటూ నడుస్తూ కుర్రతనం, వెకిలితనం మాత్రం చూపించింది. తోటదగ్గిర మెట్లమీద కూచుని చలంతో చక్రపాణి అన్యాయాలు ఏకరువుపెడుతూ ఆరేళ్లపిల్లలా బుంగమూతి పెట్టుకుని 'మా తాతయ్య చేసింది మరి ఏంబావుందీ' అంటూ మాలతి ముద్దుగా గారం పోలకబోస్తున్నప్పుడు చూస్తే నటిగా భానుమతిపట్ల గౌరవం ఆ క్షణంలో హరించిపోయిందని చెప్పాలి. పేరు 'చక్రపాణి' అని పెట్టినా చిత్రం అంతా 'చురుకూ తెలివీగల పిల్ల మాలతి' గురించే లక్ష్యం చక్రపాణిమీదే గాని బుకింగ్ మాలతిదే!

ఈ చిత్రంలో మరొక ముఖ్య లోపం గురించి చెప్పక తప్పదు. హఠాత్తుగా ఓ నిమిషం ముందే తెర లేచిపోయేసరికి స్టేజీమీద పొడిపొడిగా నుంచుని పోజ్లు సవరు చేసుకుంటున్న ఏక్టర్లలా కనపడతారు చిత్రంలో మనుషులు. ఎడిటర్ డైరెక్టర్ అయిన రామకృష్ణగారు ఈ లోపాన్ని తేలిగ్గా సవరించి ఉండవలసింది

ఇన్ని చెప్పినా కాస్సేపు ఇలా ఆఫీసూ మర్చిపోయి వినోదం కలిగించుకున్నమాట నిజమే కాబట్టి ఈమాదిరి (కథ గాదు) చిత్రాన్ని అందించడానికి భరణీవారు చేసిన కృషికి సంతోషించాలి భరణీవారి ఆకారం (చక్రపాణిగారి మాటకాదు) పూజే మాట నిజం. చిన్నపట్నంలో మూడు వారాలుగా తెలుగుచిత్రం నడుస్తోందంటే మామూలు మాట కాదు.

—యస్. సూర్యనారాయణ, మద్రాసు.

## ★ సినిమా వార్తలు ★

బి. వి. సుబ్బారావుగారి "రాజా—పేద" చిత్రం చాలవరకు పూర్తివచ్చింది. మరొక 15 రోజుల షూటింగ్‌తో పూర్తవుతుందట. తెలుగులో పూర్తికాగానే తమిళంలోను, ఆ తర్వాత హిందీలోను కూడా పునర్నిర్మిస్తామని సుబ్బారావుగారన్నారు. పాత్రధారులను ఎక్కువ మందిని తెలుగువారినే ఉంచి కొందర్ని మాత్రం తమిళులను, హిందీ వారిని పెడతారట. పునర్నిర్మాణం విషయమై ఆలిండియా పిక్చర్స్ వారితో అగ్రిమెంట్లుకూడా జరిగాయట.

తెలుగు చిత్రంలో నరేంద్రదేవ్ (యువరాజు) సారిగాడు (బీదబాలుడు) పాత్రలను సుధాకర్ నిర్వహిస్తున్నాడు. మహారాజు సురేంద్రదేవ్‌గా రంగారావు, సారిగాడి తండ్రి పోలిగాడుగా ఎన్. టి. రామారావు, యువరాజు కష్టాల్లో ఉన్నప్పుడు అతనికి సహాయం చేస్తూ – వెన్నంటి తిరిగే సుధీర్‌గా రేలంగి నటిస్తున్నారు. పోలిగాడి తల్లి అచ్చిగా లక్ష్మీరాజ్యం, అక్క మల్లిగా అమ్మాజీ నటించారు. యువరాజు విలన్ మేనమామ విక్రమ్‌గా ఆర్. నాగేశ్వరరావు, ఆస్థానంలోని స్వామిభక్తిపరుడైన ఒక సామంత ప్రభువుగా డా॥ వి. సి. కామరాజ్ నటించారు

మాటలు పినిశెట్టి, పాటలు తాపీ వ్రాశారు. సంగీత దర్శకుడు రాజేశ్వరరావు. కామెరా ఆది ఇరానీ.

సుబ్బారావుగారు చెబుతున్నదాన్నిబట్టి మార్క్ ట్వేన్ నవలలో కొద్ది మార్పులు చేసి తీయబడుతున్న ఈ చిత్రం మంచి సాహసోపేతమైన సంఘటనలతో, ప్రేక్షకులను నవ్వుల్లో ముంచి తహతహలాడించే క్లైమాక్సుతో ఉంటుందనే భావం కలుగుతోంది.

* * *

అన్నపూర్ణావారి "దొంగరాముడు" చిత్రంలోకి రేలంగి, జమున కొత్తగా బుక్ అయ్యారు. అయిదు పాటలు రికార్డింగ్‌కి సిద్ధం అయ్యాయి కళాదర్శకుడు "నిరుపేదలు" మొదలైన చిత్రాలకు పనిచేసిన ఎస్. కృష్ణారావు.

* * *

నాగేశ్వరరావు, అంజలీదేవి నటిస్తున్న అశ్వరాజ్ వారి "అన్నతాత" చిత్రం చాలవరకు తయారై, త్వరలో పూర్తికానున్నదని తెలుస్తోంది.

* * *

వినోదా ప్రొడక్షన్స్ తీయనున్న "కన్యాశుల్కం" సంగీత దర్శకుడు ఘంటసాల వెంకటేశ్వరరావు. నృత్య దర్శకుడు వసుమర్తి కృష్ణమూర్తి. దర్శకుడు పి. పుల్లయ్య. స్క్రిప్టు సదాశివబ్రహ్మం.

* * *

వాహినీవారు ఈ నెలాఖరుకి "బంగారు పాప" షూటింగ్ ప్రారంభిస్తున్నారు. ప్రస్తుతం పాటల రికార్డింగ్ జరుగుతోందట. బి. ఎన్. రెడ్డిగారు డైరెక్టు చేయనున్న ఈ చిత్రానికి కథ, మాటలు పాలగుమ్మి పద్మరాజుగారు, పాటలు కృష్ణశాస్త్రిగారు వ్రాశారు.

## కీ॥ శే॥ మంగయ్యగారు

మేకప్‌మాన్ మంగయ్యగారు ఈ నెల 14 వ తేదీన రాత్రి సుమారు 8 గంటలకు స్వర్గస్థులయ్యారు. దాదాపు 20 ఏళ్ళనించీ మద్రాసు సినిమారంగంలో మేకప్ నిపుణుడుగా ప్రసిద్ధివహించి అనేక తెలుగు, తమిళ చిత్రాల్లో పనిచేశారు. రక్తపుపోటు వ్యాధి కారణంగా మరణించారని తెలుస్తోంది. స్వస్థలం గుడివాడ. మద్రాసు రాక ముందు, అనేక నాటకాలలో చక్కని మేకప్ ప్రావీణ్యం కనబరచి పేరుపొందారు. వీరి మృతి సినిమారంగంలోని వారందరికీ దుఃఖకారణమైంది.

* * *

జూపిటర్ పిక్చర్సు భాగస్వామి, సెంట్రల్ స్టూడియోస్ డైరెక్టరు, దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలి కార్యవర్గంలో సభ్యుడు అయిన జనాబ్ ఎస్. కె. మొహిదీన్ ఇటీవల ఆకస్మికంగా మరణించారు. సంతాపసూచకంగా పైమండలి కార్యాలయం ఒకరోజు మూసివేయబడింది.

## కొత్త సినిమా పత్రికలు

**చిత్ర:**— సినిమా మాసపత్రిక; ఎడిటర్ అండ్ పబ్లిషర్ వి. వి. నరసింహారావు; సంచాలకుడు మాగాపు వి. రామన్; వెల 8 అణాలు. ఈ పత్రికవారు ఉగాదినాడు వెలువరించిన ప్రథమ సంచిక మా కార్యాలయానికి చేరింది. ముఖచిత్రం సుందరి జానకిగా, "తెలుగునాట ఉత్తమ మాసపత్రికలు లేని కొరత తీర్చడం" ఆశయంగా ఈ పత్రిక వెలువడింది లోకం పోకడ, సినీ మాలోకం పోకడ ఈ పత్రికలోని విశేషాలు.

**సినిమారంగం:**— మేనేజింగ్ ఎడిటర్ టి. వి. రామనాథ్; అసోసియేట్ ఎడిటర్ బి. విశ్వేశ్వరరావు; వెల 0 8-0; ప్రథమ సంచిక మా కార్యాలయానికి చేరింది "ప్రతి నెలా 15 వ తేదీ నాటికే వెలువడే" ఈ మాసపత్రిక "సినిమా కళాభ్యుదయానికి సర్వ

# గ్రంథ విమర్శ

## శంకర గ్రంథ రత్నావళి

శ్రీ శంకరాచార్యుల వారు రచించిన గ్రంథముల నన్నింటిని 25 సంపుటములుగా ప్రకటించడానికి తెనాలిలోని సాధన గ్రంథమండలి నిశ్చయించినది. సంస్కృతములో ఉన్న యీ గ్రంథసముదాయమున కనువాదము శ్రీ నిర్వికల్పానందస్వామి గారు చేయుచున్నారు. ఇప్పుడు ప్రకటింపబడినది ప్రథమ సంపుటము. శంకరాచార్యులవారి ఉపదేశ గ్రంథములు అనగా చిన్న చిన్న పంచకములు, అష్టకములు మొదలైనవి 40 వరకు యీ సంపుటములో కలవు. మన ప్రాచీన తత్త్వజ్ఞాన చర్చ శంకరాచార్యులవారి అగాధమైన మేధాశక్తి వల్ల ఎవరెస్టు శిఖరం ఎక్కినట్లుగా అత్యున్నత స్థాయికి వెళ్ళింది. ఆయన అద్వైత సిద్ధాంత చర్చ అద్వితీయమని చెప్పవచ్చు. అటువంటి సునిశిత సూక్ష్మ తత్త్వవిమర్శ చేయగలవాడు ప్రపంచంలో అంతకు పూర్వము పుట్టలేదు, అటుతర్వాత పుట్టలేదు. అటువంటి శంకరాచార్య ప్రణీత గ్రంథముల నన్నింటిని సేకరించి తెనుగులోకి తర్జుమా చేసి ప్రకటించడం బ్రహ్మాండమైన పని. అట్టి పనిని సాధన గ్రంథమండలియున్నూ, శ్రీ నిర్వికల్పానంద స్వామియున్నూ కొనసాగించుట కొనియాడదగిన విషయము. ఈ ప్రథమ సంపుటము రమారమి 300 పుటల గ్రంథము. వెల: రూ 3-0-0. పోస్టు ఖర్చులు రూ 1 12 0 ప్రత్యేకము. ప్రతులు కావాలంటే, సాధన గ్రంథమండలి, తెనాలి, గుంటూరు జిల్లా అని వ్రాయాలి.

---

తో ముఖంగా పాటుపడుతుం"దని సంపాదకీయం ద్వారా తెలుస్తోంది. కన్నాంబ, భానుమతి, అంజలీదేవి, శ్రీరంజని, నాగభూషణం, ప్రసాద్, రామకృష్ణ, నాగేశ్వరరావు శుభసందేశాలిచ్చారు. సినిమాలకు సంబంధించిన అనేక విశేషాలు, ఫోటోలు ఈ పత్రికలో ప్రచురించబడ్డాయి. ముఖచిత్రసుందరి అంజలీదేవి.

సినిమా రంగానికి మాసపత్రిక లనదగిన సినిమా మాసపత్రికలు మళ్ళీ ముమ్మరంగా వెలుస్తున్నాయి. పత్రికలు వెలుస్తున్నాయంటే అర్థం సినిమాలోకంలో కొంతకాలంగా కురుస్తున్న కడగళ్ళవాన కొంత వెలిసిందన్నమాట. ఇదిశుభసూచన. ★

## కుమ్మరి మొల్ల

శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావు గారు ఒక నవలరూపంలో దీనిని వ్రాసియున్నారు. "మొల్ల రామాయణం" అని ప్రసిద్ధివహించిన చక్కని రామాయణమును రచించిన మొల్ల యను స్త్రీ కుమ్మరి కులంలో జన్మించింది. అబలయై యుండుటయే గాక, వెనుకబడిన జాతిలోనిది. ఈమె యొక్క జీవిత గాథ విపులంగా తెలిసికొనుటకు తగినన్ని వివరాలు లభించుటలేదు. అయినప్పటికీ ఇంటూరి వెంకటేశ్వరరావుగారు మనోహరంగా కథను నడిపించి, లభించిన చరిత్ర ధారలను, లోకప్రతీత గాథలను, చక్కగా వినియోగించి, రసవంతమైన నవలను రచించారు. ఇటువంటి కవీశ్వరురాలి జీవిత కథను ఫిల్ముగా తయారు చేయవలెనన్న సంకల్పము కూడా ప్రశంసించవచ్చు. మొల్ల తండ్రి కేసనకూడా కవిత్వములో సాధన చేసినవాడే. అతడు శివభక్తిపరుడు. అతడు వ్రాసిన శైవ శతక కొన్ని పద్యములు తగులబెట్టినారట. మొల్ల శ్రీరామభక్తురాలై మొల్ల రామాయణం వ్రాసింది. కుమ్మరి కులంలో పుట్టిన యీమెకు ఇంత ప్రజ్ఞ ఇంత సంస్కారం ఏవిధంగా కలిగిందో గ్రహించాలంటే ఇంటూరి వెంకటేశ్వరరావుగారి యీ నవల చదివితీరాలి. చక్కని గ్లేజు కాగితాలమీద చక్కని అచ్చు-ముద్రణ బాగా ఉంది. వెల: రూ 1-8-0. ప్రతులు కావాలంటే, ఆంధ్రా ఫిల్ము పబ్లికేషన్సు, 62, సర్ మహమ్మద్ ఉస్మాన్ రోడ్డు, మద్రాసు 17, అని వ్రాయాలి

## కిష్కింధ

పాఠకుణ్ణి పేజీకొక్కసారైనా నవ్వించాలనే పరమాశయంతో సరికొత్తగా రాజమండ్రిలో వెలసిన 'కిష్కింధ' హాస్య పత్రిక ప్రథమ సంచిక మా కార్యాలయానికి చేరింది. ఈ పత్రికకు మేనేజింగ్ ఎడిటర్ డి. వి. చలం; ఎడిటర్: అక్షరమూర్తి. మద్యనిషేధంమీద, ప్రాయోపవేశాలమీద, కథకులమీద, కవులమీద, వారఫలాలమీద విసురులు చాలావున్నాయి. కార్టూన్లు కూడా వేయించి, యీమాదిరి రచనలు పోయిన పొడుగునా ప్రచురించ గలిగితే, రెండణాల కిమ్మత్తుగల ఈ పత్రిక ప్రజాదరణ పొందగలదని చెప్పవచ్చు. ★

## పరాజితవ్యక్తి ఎవరు?

(1'-వ పేజీ తరువాయి)

యను డనుకోవడానికి కొంత సాక్ష్యం ఉన్నది. వినాయకరావు [ఏం కోరంగాలో] భాస్కరరావుతో మాట్లాడితే విన్నప్పుడు అన్నపూర్ణ అయిష్టం కనబరుస్తుంది "నాన్నతో మాట్లాడవా?" అంటుంది వినాయకరావు భాస్కరరావుతో మాట్లాడితే తాను చెప్పిన అబద్ధాలు ఏవో బయటపడిపోతాయని ఆమె అనుమానం. వినాయకరావు భాస్కరరావుతో మాట్లాడతాడు కాని ఆమె భయపడ్డట్లుగా ఏమీ జరుగదు! చిట్టచివరకు భాస్కరరావు వినాయకరావు చేతిలోనూ, సాంబయ్య చేతిలోనూ, అన్నపూర్ణ చేతిలోనూ కూడా ఓడిపోతాడు. పైపెచ్చు తాను గెలిచాననుకుంటాడు. [illegible] గుణ సాంబయ్య భాస్కరరావులోని దౌర్బల్యంమీద వ్యంగ్యంగా దెబ్బతీస్తూ, "మీ ఇంజనీరుగారు చెప్పిన మాటలు ఆయన భాష" వింటుంటే నాకు ఒక్కటే నిజంగా వినపడలేదు లోపం నా చెవిదే అయి ఉంటుంది," అంటాడు

నిజమే భాస్కరరావులో ఇంకా సాంబయ్యలోగల వాస్తవికదృష్టి లేదు. కాని కాలక్రమాన అతను మారతాడు. సాంబయ్యలో లేని బలం భాస్కరరావులో ఉంది. ఫ్యాక్టరీని యజమానికన్న కార్మికులు బాగా నడిపిన సంగతు సాంబయ్య ఆశ్చర్యపడతాడుగాని భాస్కరరావు ఆశ్చర్యపడలేదు. ఇప్పటికి విజయం సాంబయ్యది కావచ్చు, భవితవ్యం భాస్కరరావుది.

కొ. కు. రావు.

---

బ్యాంకు ప్రెసిడెంటు.. 'క్యాషియర్ ఏడీ?'

మేనేజరు :- సెలవుకు వెళ్ళాడండి

ప్రెసిడెంటు :- సెలవు వెళ్ళాడా?... అందులోను ఆఫీసు టైములో??

మేనేజరు:- లె[illegible] కాల్లో నప్పిన [illegible] చెయ్యడానికి యిప్పుడే అవకాశం. అందుకని వెళ్ళాడు

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 182. అర్ధరాత్రి సూర్యుడు

స్కాండినేవియాలో కనబడతాడా? అని రాజమండ్రినుంచి పాల సత్యనారాయణ గారు అడుగుతున్నారు.

అవును. వేసవికాలములో మనకి సూర్యోదయము 5-30 కిన్నీ సూర్యాస్తమయము సాయంత్రం 6-30 కిన్నీ జరుగుతుంది. ఇంగ్లండులో తెల్లవారగట్ల 4-30 కి సూర్యోదయమై, రాత్రి 9 30 కి సూర్యాస్తమానము అవుతుంది. అంటే ఇంగ్లండులో రాత్రి సూర్యుణ్ణి చూడవచ్చన్నమాటే కాదూ? స్కాట్లండులో రాత్రి 10-30 దాకా వెలుగుంటుంది, తెల్లవారి మూడుగంటలకి మళ్ళి వెలుగు వచ్చేస్తుంది. అంటే రాత్రి రెండో ఝాములో సూర్యుడు కనబడతాడన్నమాట. స్కాండినేవియాకి ఉత్తరపుకొసను ఉన్న వారికి రోజల్లా సూర్యుడు కనబడుతు నే వుంటాడు. పగలు 12 గంటలకి సూర్యుడు ఆకాశములో ఎత్తైనచోటానూ, 'రాత్రి' పన్నెండు గంటలకి దూరభూరేఖకి చేరువగానూ కనబడతాడు. పటములో 'సూ' ర్యుడూ 'భూ'మీ సూచించబడ్డాయి.







సూర్యుని వెలుతురు 'రేఖ' అన్న రేఖకి కుడివైపున పడుతుంది. భూమి 'ఉద' అన్న ఉత్తర దక్షిణ ధృవాలను చేర్చే రేఖనుబట్టి తిరుగుతోంది. 'రే' నుంచి 'మ' వరకూ ఉన్న భూభాగముమీద సూర్యుని వెలుతురు ఎప్పుడూ పడుతోంది. 'రే' దగ్గర ఒక దేశముంటుందిగదా? ఆ దేశస్థులు 'రే' దగ్గరున్నప్పుడు వారికి సూర్యోదయమై, వారు భూభ్రమణముతో 'మ' దగ్గరికి వచ్చినప్పుడు అభిజిత్తున్నూ మళ్ళి 'రే' దగ్గరికి వెళ్ళిపోయినప్పుడు 'సూర్యాస్తమయ'మున్నూ అవుతుంది. వెంటనే సూర్యోదయము మొదలూ! వారికి చీకటే లేదు! అంటే రాత్రే లేదు. వేసంగిలో, వారికి వెన్నెలే లేదు! అర్ధరాత్రి సూర్యుడంటే ఏమన్నమాటా? దినమును రైల్వేవారి పద్ధతిని 24 గంటలుగా సూచించినట్లయితే, 24 గంటలప్పటి సూర్యుడన్నమాట. మనకి 19 గంటలకీ, ఇంగ్లండువారికి 21 గంటలకే కనపడ్డ సూర్యుడు వేసంగిలో ఉత్తర ధృవమువారికి 24 గంటలకి కనబడతాడు.

అదే సమయంలో దక్షిణధృవముదగ్గర వారికి రోజంతా రాత్రే. సగలు పన్నెండు గంటలకైనా సూర్యదృష్టి ఉండదు.

కాంగో నదితీరములోనూ దక్షిణ అమెరికాలోని ఈక్వెడారులోనూ ఉన్నవారికి సంవత్సరము పొడుగునీ పగలు 12 గంటలూ రాత్రి 12 గంటలూన్నూ.

ధ్రువప్రాంతములో ఆరు నెలలు సూర్యుడు కనబడడు. ఆ కాలములో ఆకాశములో 'అరోరా' అనే వెలుగులు జ్వలించి ఒక రకపు సంజవెలుతుర్నిస్తాయి.

## చిత్రప్రశ్నలకు జవాబులు

—దినమును భారతీయ సిద్ధాంతులు సూర్యోదయముతోనే ప్రారంభించేవారు; నేటికీ పంచాంగాలలో, తిథీ, నక్షత్రమూ సూర్యోదయసూర్యాస్తమయఘడియలనుంచే లెక్కించి సూచిస్తున్నారు. మన దేశములో సూర్యోదయ అస్తమయాలు సుమారు ఒక

గునీ కాని ఇంగ్లండులోనూ జర్మనీవంటి ఉత్తర దేశాలలోనూ వేసవిలో సూర్యాస్తమయము (మన) రాత్రి 9 గంటలకీ, సూర్యోదయము తెల్లవారుగట్ల 4 గంటలకీ జరుగుతుంది. కనక వారు రాత్రి 12 గంటలతో దినమును ప్రారంభించుకుని, మళ్ళీ రాత్రి 12 గంటలవరకూ జరిగే కాలమును దినముగా లెక్కవేసుకున్నారు. పాశ్చాత్యులకు ప్రపంచములో గల పలుకుబడి ననుసరించి, ఈ పద్ధతే ప్రచారములో ఉంది. ప్రపంచం మొత్తమ్మీద అవలంబించడానికి ఈ పద్ధతే మంచిదేమో.

—పాము కుబుసము పాము చర్మమునకు పై పొరయే. ఈ పొర పాము శరీరమంతటా పెరిగి, ఒక్కసారే వదులౌతుంది. కనకనే మొత్తమంతా ఒకసారి ఊడివస్తుంది. మనకి కురుపు వేసి మానినప్పుడు లోపలినుంచి మాంసమూ, చర్మమూ ఎదిగిన తర్వాత పొర ఊడిపోతుంది గదా? పామునకు ఈ ఏర్పాటు సహజముగానే వున్నది.

—ఆయుఃప్రమాణమును ఎక్కువ చేసుకోవాలన్న ప్రయత్నములోనే వైద్యశాస్త్రము వృద్ధి అయింది. క్రమమైన, నియమబద్ధమైన జీవితము నడిపినచో ఆయుఃప్రమాణము ఎక్కువ కాగలదనే సంగతిని పాశ్చాత్యదేశీయుల సగటు ఆయుఃపరిమితి లెక్కలు నిరూపిస్తాయి మన పూర్వులు కూడా నియమజీవితమువల్లనే ఆయుఃపరిమితిని సుదీర్ఘము చేసుకున్నారు వెంకురెడ్డి గారూ. నియమజీవితమంటే ఆహార నిద్రాది అవసరాలనూ, భోగములనూ మితముగా, జరపడమూ, చాలినంత దేహపరిశ్రమ చెయ్యడమూనూ.

—ఇంగ్లండునుంచి ప్రసారమయే రేడియొ తరంగాలు భారతదేశము చేరేటప్పటికి బాగా బలహీనమైపోతాయి. ఒడ్డుని మనము కాళ్ళు జాడిస్తే పుట్టే తరంగాలు కాలవలోని పడవను కదపలేనట్లే, దూర ప్రయాణమువల్ల శక్తిహీనములైన తరంగాలు మన దేశములో రేడియొ సెట్లులను తాకి పని చేయించలేవు. రేడియొ దాకా యెందుకూ, విజయవాడ ప్రోగ్రాములు చెన్నపట్టణానికే సరిగ్గా అందవు.

—విసరుటవల్ల పొయ్యిలో మండే నిప్పునకు గాలీ, అందులోని ఆక్సిజనూ (ప్రాణవాయువు) అంది, బాగా మండును. ఊదుటవల్ల వత్తిలోని నూనెను కాచి, మండే ఉష్ణతకు తెచ్చే మంట తప్పకుని, వత్తి ఆరిపోవును.

—రేడియో సెట్లులు స్ఫటికము (*Crystal*) నుపయోగించినవి మైక్రోఫోనుల ద్వారానే వింటారు.

★

# ★ చేయి జారిన లక్ష్మి ★

(27-వ పేజీ తరువాయి)

ప్రశ్న రోజూ అడుగుతూనే వున్నాడు లక్ష్మణరావు

ఎక్కడి రిప్లై? అసలు ఉత్తరముంటూ ఉంటేగా!

"లేదోయ్! ఇవ్వాళో రేపో రావాలి?" ఇది ప్రతినిత్యం కృష్ణమూర్తి జవాబు. నెల గడిచింది.

"ఇంకో వుత్తరం వ్రాయి" లక్ష్మణరావు అర్థించాడు ఓ రోజుని.

"అలాగేనోయ్. ఆయన వ్యాపారం విషయంలో ఏ వూరన్నా వెళ్లివుంటారు. వూళ్లో లేరు కాబోలు ఇంతాలస్యం అయింది. ఇంకో వుత్తరం రాస్తాను" ధీమాగానే సమాధానమిచ్చాడు కృష్ణమూర్తి.

ఓరోజు గిరీశంగారు పట్టుకున్నారు. "ఏమండీ! ఆ సంబంధం విషయం తేల్చుకోవాం. ఓసారి మనం ముగ్గురం వెళదామా అక్కడికి?" అన్నాడు కృష్ణమూర్తితో.

కృష్ణమూర్తికి పచ్చి వెలక్కాయ గొంతుకడ్డంగా పడ్డంత పనైంది "ఆఁ! అబ్బే అవసరం లేదండి. ఆయన వూళ్లోవుంటే ఇంతకాలం వూరుకో నేవాడే గాదు. ఆయన పొరుగూరు వెళ్ళివుంటాడు. మనం వెళ్లినా ఆయన లేకపోతే అనవసరమే గా?" అన్నాడు. అంతటితో గిరీశం ఏమీ మాట్లాళ్లేదు.

ఇది కృష్ణమూర్తి ప్రాణానికి దినదిన గండంగా వుంది. లక్ష్మణరావు ఈ విషయాన్ని తండ్రికి తెలియపరిచాడు ఉత్తరం ద్వారా. ఉన్న కొద్ది వ్యవహారం ముదురు పాకంలో పడుతోంది. లక్ష్మణరావు తండ్రి తక్షణం దిగివచ్చాడు. కృష్ణమూర్తి గడ్డం పట్టుకొని "నాయనా మావాణ్ణి నీటముంచినా పాలముంచినా నీవే! ఏదో సంబంధం వుందన్నావుట. అదేమిటో కాస్త చూడు బాబూ!" అన్నాడు.

కృష్ణమూర్తి ఇక ఎంత నాటకమైనా ఆడడానికే నిశ్చయించుకున్నాడు. ఇప్పుడు తను ఇదంతా అబద్ధమని చెప్పినా ఎవ్వరూ విశ్వసించరు గూడా! కృష్ణమూర్తికి ఇదంతా ఓ నవ్వులాటగానూ - భయంకరంగాకూడా వుంది. లక్ష్మణరావు తన మాటలు నమ్మడంలో అర్థం వుందిగాని - అతని తండ్రి తనంత కుఱ్ఱవాణ్ణి నమ్మడంలో అర్థం లేదనిపించింది. వెళ్లిపోయేప్పుడు "త్వరగా అదేదో తేల్చుకొంటే వచ్చే మాఘమాసంలోనే లగ్నాలున్నాయట. నీపేరు చెప్పుకుంటాం' నీకూ తెలుసుగా మా సంసారం ఎంత పెద్దదో. మావాడూ ఇష్ట పడుతున్నాడుగా? ఇంకేమీ అభ్యంతరం లేదనిగూడా వారికి తెలియపర్చు" అన్నాడాయన.

"అలాగే నండి! ఇప్పటికే రెండుత్తరాలు వేశాం! కొద్దిరోజుల్లో ఆ విషయం తేల్చుకొని మీకు త్తరం రాస్తాలెండి" అని చెప్పాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి లోపల్లోపల "పిచ్చివాళ్లు కాకపోతే అలాటి అదృష్టమే వుంటే నాకు కాకుండా మీదాకా రానిస్తానా" అనుకున్నాడు.

లక్ష్మణరావుకి కాబోయే సంబంధాన్ని గురించి, అతనికి సంబంధించిన ప్రతివాళ్లూ తనని వివరాలడగడం కృష్ణమూర్తికి యాతనగానే వుంది.

లక్ష్మణరావు తండ్రి "నే వెళ్లి కనుక్కొస్తాను. మీ మావయ్య అడ్రసు ఇవ్వు నాయనా" అన్నాడు. ఇవ్వక తప్పలేదు గాని ఇచ్చింది తప్పు అడ్రసే! ఆయన తిరిగి తిరిగి వచ్చాడు, అసలు కృష్ణమూర్తి మేనమామ ఇల్లు కనుక్కోలేక. "బెజవాడలో నాకు పని వుందండీ. నే వెళ్లొస్తాను" అని ఓదార్చాడు కృష్ణమూర్తాయన్ని.

ఇక వ్యవహారం ఎటు చూచినా విషమంగానే వుంది. ఓ ఉత్తరం కృష్ణమూర్తి మేనమామ చేత వ్రాయబడ్డట్టు సృష్టించి బెజవాడలో వేయించాలి పోస్టులో. ఈ ఆలోచన తట్టగానే అలాగే కానిచ్చాడు కృష్ణమూర్తి.

ప్రియమైన మేనల్లునకు మీ మేనమామ రాఘవరావు దీవించి వ్రాయునదేమనగా—

నీవు ఉత్తర హిందూస్థానమునుండివచ్చిన మా మిత్రుని కుమార్తెను చేసుకొనుటకు ఎవరో ఉన్నారని వ్రాసినవుత్తరం నిన్ననే చూచాను. నేను కొద్దిపనిమీద బొంబాయి వెళ్లి నిన్ననే వచ్చాను.

వారినిగురించి భోగట్టా కావలసినదని వ్రాశావు. వారికి ఈప్రాంతమునందు పాతిక ఎకరముల మాగాణి వుంది. వారి స్వగ్రామంలో షష్ఠి ఎకరాల పొలంవుంది. నాలుగు లక్షలవరకూ నిల్వగూడా వుంది. ఒక్కతే కూతురు. పుట్టుకలోనే కాలుకుంటు. కన్ను మెల్ల. చేయి వంకరతో పుట్టింది. మొన్న మొన్నటివరకూ ఎంత కట్నం ఇస్తామన్నా ఎవ్వరూ చేసుకోలేదు. కాని రెండునెలలకు పూర్వమే ఎవరో అటు ప్రాంతం వాళ్లే చేసుకున్నారట. వివాహానికి నేనూ వెళ్లాను పెళ్లి ఎంతో వైభవంగా జరిగింది. ఇంతే సంగతులు. ఉత్తరాలు రాస్తూ వుండవలెను.

ఇట్లు, రాఘవరావు.

ఈ ఉత్తరం బెజవాడ చేరాలి. దానికి ఎవర్నన్నా వినియోగించాలి! ఎవరైనా ఎరిగినవాళ్లు బెజవాడ వెళుతూవుంటే వాళ్ల కివ్వచ్చునని స్టేషన్ వేపు బయలుదేరాడు. స్టేషన్‌లోకి అప్పుడే బెజవాడ వెళ్లేబండి వచ్చివుంది. ప్రభాకరరావు సెకండుక్లాసు కంపార్టుమెంటులో కూర్చున్నాయనతో మాట్లాడుతున్నాడు క్రింద నిలబడి. కృష్ణమూర్తి వెళ్లేసరికి సంభాషణ పూర్తిచేసి అంత్య నమస్కారం ఒకటి విసురుతున్నాడు.

"హల్లో. ఎక్కడా కనిపించడంలేదే! కాలేజీకి సెలవు పెట్టావు!" అన్నాడు కృష్ణమూర్తి.

"ఆ! ఏదో వూరెళ్లానోయ్. పనిమీద వచ్చావే స్టేషన్‌కి."

# చేయి జారిన లక్ష్మి

"పనిమీద నేనోయ్. ఈ వుత్తరం బెజవాడ పోస్టులో పడాలి"

"ఏమన్నా ప్రేమలేఖా ఏం?"

"కాదులే. ఓ వ్యవహారం."

"ఇటివ్వు" అని తీసుకొని ఇందాక నమస్కారం చేసి వతనికి ఇచ్చివచ్చాడు, కృష్ణమూర్తి చూస్తూవుండగానే.

కృష్ణమూర్తి తన చే వ్రాయబడిన ఉత్తరం కోసం నిరీక్షిస్తున్నాడు. కాని రాలేదు! పరీక్షలయిపోయాయి. లక్ష్మణరావు "ఓ వారంరోజుల్లో మళ్ళీ వస్తానని" చెప్పి వాళ్ల వూరెళ్ళాడు. లక్ష్మణరావు రాలేదు గాని - శుభలేఖమాత్రం వచ్చింది. అందుకే శుభలేఖను చూచి చప్పున నమ్మలేక పోయాడు కృష్ణమూర్తి.

అతనికి ఇదీ ఒకందుకు మంచిదిగానే వుంది తన భారం వదలిపోయింది అయినా ఒక సందేహం మాత్రం అలానే వుంది. లక్ష్మణరావు ఆదర్శం ఏం చేశాడు?" అని.

ఇక తప్పేటట్లు లేదని పెళ్ళికి బయలుదేరాడు. ముందుగా వెళ్ళి లక్ష్మణరావు వాళ్ల తండ్రీ, తల్లితో ఆ గొడవలన్నీ పడడం ఇష్టంలేదు లగ్నానికి అందుకోవడానికే నిశ్చయించుకొని వస్తువు స్వగ్రామం గుంటూరు బయలుదేరాడు కృష్ణమూర్తి. బండి ఆలస్యంగా చేరింది. పెళ్ళివాళ్ల ఇల్లు బ్రహ్మాండంగా వుంది, లక్షాధికారి భవంతిలా! కృష్ణమూర్తి వెళ్ళేసరికి వరుడు లక్ష్మణరావుకి కన్యాదానం చేస్తున్నారు కాబోయే మామగారు లక్ష్మణరావు మిత్రుణ్ణి చూచి చిన్నగా నవ్వాడు

పెళ్ళికుమార్తెను చూచాడు కృష్ణమూర్తి. ఆశ్చర్యం తన అభూతకల్పిత సుందరే ప్రత్యక్షంగా కన్పిస్తోంది. కృష్ణమూర్తి స్వప్నంలోలాగా అన్నీ చూస్తూ నిలబడ్డాడు. ఆ ఇలూ, అవీ చూస్తే సామాన్య కుటుంబీకుల మల్లే లేరు ఓ కోటీశ్వరుడి వ్యవహారంలాగా నేవుంది. వెళ్ళగానే తనకు ప్రత్యేకమైన ఆసనం ఒకటి చూపించి సత్కరించారు

"ఏమండీ - ఇలా వస్తారా ఓమాటు" ఎవరో తనని పిలిచారు. లైట్ల వెలుగులో ఆయన ముఖం స్పష్టంగా కనిపించింది. కృష్ణమూర్తి తెల్లముఖం వేశాడు. ఆరోజు రైల్లో కూర్చునివుండగా, తను కల్పించిన వుత్తరం బెజవాడల్లో వెయ్యడానికిచ్చింది ఆయనకే! మంత్రముగ్ధుడిలా లేచి ఆయన వెంట వెళ్లాడు. ఇంట్లోకి తీసికెళ్లి సోఫాలో కూర్చోపెట్టి "మీకోసం చాలాసేపట్నించీ చూస్తున్నాను. ఇంత ఆలస్యంగా వచ్చారేం?" అన్నా రాయన.

కృష్ణమూర్తి మాటలు తడుముకున్నాడు. అతనిప్పుడు ఏ ప్రశ్నకీ సమాధానం చెప్పగలిగే స్థితిలో లేడు.

"మీ రారోజున ఉత్తరం పంపారు చూచారూ మీ స్నేహితుడితో, బెజవాడ పోస్టులో వెయ్యమని; అది పొరపాటున మర్చిపోయి గుంటూరు వచ్చేశాను. ఎలాగూ వెయ్యలేదుకదా అని చింపి చదివాను. దానిలో అమ్మ మా అమ్మాయివిషయం, అంతా మా విషయమేవుంది ఆమెకు ఎంతో కాలంనుంచీ పెళ్లి చెయ్యాలని చూస్తున్నాంగాని చదువుకున్న వాళ్లెవ్వరూ చేసుకోలేదు" అంచేత ఈ వుత్తరం చూచి కవరుమీద లక్ష్మణరావు బి. ఎ, అని చూచి మీ కాలేజీనించి అతని తండ్రి అడ్రసు తెలుసుకొని మా అమ్మాయిని ఇస్తానని వ్రాశాను వారూ ఇష్టపడ్డారు. ఆ సంబంధమేదో అయిపోయిందని వ్రాసివుంది గాదాంట్లో! లక్ష్మణరావు పేర ముప్ఫై ఎకరాల భూమి రాశాను. ఇల్లరికమే పెట్టుకుందా మనుకుంటున్నాను నాకుమాత్రం ఎవరున్నారు చెప్పండి నా తదనంతరం అంతా అతనికే అవుతుంది. కొడుకైనా కూతురైనా మా అమ్మాయి ఒక్కతేగా! ఇదంతా మీ చలవే! ఆరోజున మీరా వుత్తరం నాచేతి కియ్యకపోతే అసలీనాడిలా జరిగేదిగాదు. మీకు ఎంతైనా ఋణపడివున్నాను. అన్నాడు.

కృష్ణమూర్తి లోపల "ఛ! ఛ! నావంటి బద్ధమ్మ ఎవ్వడూ లేడు చేతులారా లక్ష్మిని ఇంకొకరికి వప్పజెప్పా" ననుకొని ఆ భావాన్ని పైకి వ్యక్తీకరించకుండా వుండడానికి తన్నుకు చచ్చాడు. ★



# కాలక్షేపం

(5-వ పేజీ తరువాయి)

యీశ్వరుడైన యోగి. కనుక, ప్రజారాజ్యాన్ని ప్రజలు నడిపిస్తే చాలదు. వోటర్ల జాబితాలు తయారుచేస్తే చాలదు. ఎలెక్టరల్ రోలుతోబాటు పెట్రోలు ఉంటేనేగాని మోటారుకారు నడవదు. అటువంటి ప్రజారాజ్యానికి ధర్మం అనేది పెట్రోలు. ఈ ధర్మాన్ని ఉపదేశించిన బుద్ధునివంటి మహాయోగి వెలసినప్పుడు, అశోకుడు యుద్ధంచేయనని శపథం చేశాడు. "న ధర్మం గచ్ఛామి" అన్నాడు. ప్రజల్లో ప్రబోధం కలిగించేవాడు యోగి. ప్రజారాజ్య ధర్మనిర్వహణలో యోగికి ఆధిపత్యం ఉంటేనే ప్రభుత్వానికి ఆధిపత్యం ఉంటుంది ప్రజారాజ్యం అంటే, *"Government of the people, by the people, for the people"* ప్రజలయొక్క, ప్రజలచేత, ప్రజలకొరకు వెలసిన ప్రభుత్వమే ప్రజాప్రభుత్వం అని అమెరికాలో సూత్రీకరించారు. కాని, భారతదేశంలో ప్రజారాజ్యం అంటే, "ధర్మమార్గంలో ప్రజలయొక్క ప్రజలచేత ప్రజలకొరకు వెలసిన ప్రభుత్వమే" అని అన్వయించి నిర్వచించారు. పరీక్షిత్తువంటి మహారాజును శమీకుడనే ముని శపించాడు. యోగులకూ మునులకూ రాజులు గజగజలాడినంత కాలము అది ప్రజారాజ్యమేఅయింది. ప్రభువులను-అధర్మమార్గంలో ప్రవర్తించే ప్రభువులను-శపించి శాసించగల మహాయోగులకే యీదేశం పట్టాభిషేకం చేసింది. 'కొల్లాయి గట్టితే నేమి? కోమటై పుట్టితే నేమి?" అటువంటి మహాత్మునకే అధికారపీఠం యిచ్చింది భారతదేశం. "మహాత్ముడు సాధించేది గోచీ స్వరాజ్యం" అని హేళన చేసినవారు కూడా మనదేశంలోనే ఆంగ్లమానసపుత్రులై వెలసినారు. కాని, ఒక్క విషయం గ్రహించాలి. గోచీ ధరించిన యోగులకే యీ జాతి జై! అంటుంది

కౌపీనంబును జీర్ణకంథయు, నపేక్షాశూన్య భైక్షంబు - గల యోగికి ప్రభుత్వాధికారం యిస్తుంది ధర్మ నిర్ణయాధికారం యిస్తుంది. "గోచీ స్వరాజ్యం" కౌపీముగల యోగికి లభిస్తుంది. అదే అసలైన సంపూర్ణ ఆత్మస్వాతంత్ర్యం. "గోచీస్వరాజ్య" మే అసలైన స్వరాజ్యం. అటువంటి యోగులదే మహారాజయోగం అని నమ్మినదేశానికి, ధర్మమార్గవియోగం ఉండదు. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras

# ఆంధ్ర ప్రజానీకానికి మా ప్రచురణలు

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక ద్వారా ఆంధ్ర ప్రజానీకమునకు పరిచయము చేసిన యీ క్రింద ప్రచురణలు మావద్ద చిల్లరగాను, టోకుగాను దొరకును.

| | | |
|---|---|---|
| **రాజూ పేద** | (మార్క్‌ట్వేన్) | **2-0-0** |
| **టామ్‌సాయర్** | ( „ ) | **2-0-0** |
| **హకల్‌బెరిఫిన్** | ( „ ) | **2-0-0** |
| **విచిత్రవ్యక్తి** | ( „ ) | **1-8-0** |
| **కాంచనద్వీపం** | (స్టీవెన్సన్) | **1-8-0** |

పై ఐదింటికి అనువాదం నండూరి రామమోహనరావు

| | |
|---|---|
| **ఆల్లీబిల్లీలోకంలో అమ్మాయికథ** | **1-0-0** |
| (లూయీకెరోల్) అనువాదం వి. డి. ప్రసాదరావు | |
| **కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో** (అలెగ్జాండర్ డ్యూమా) | |
| (రెండుభాగములు) ఒక్కొక్క భాగము | **3-8-0** |
| అనువాదం : సూరంపూడి సీతారామ్ | |
| **డాన్ క్విక్‌సెట్** మూలం : సెరివాన్‌టెజ్ | |
| (అనువాదం) విశ్వాత్ముల నరసింహమూర్తి. | **2-0-0** |
| **రెండు మహానగరాలు** (తెన్నేటి సూరి) | **3-0-0** |
| **ఆత్మకథ** రెండుభాగములు (మహాత్మాగాంధీ) ఒక్కొక్కభాగం | **5-0-0** |
| **శ్రీమద్భగవద్గీత** (కా. నాగేశ్వరరావుపంతులు) | **4-0-0** |
| **ఆంధ్రవాఙ్మయ చరిత్ర** | **2-0-0** |
| **శ్రీమదాంధ్ర మహాభారతము ఉద్యోగపర్వము** | **1-0-0** |
| **బసవపురాణము** (పాల్కురికి సోమనాథకవి) | **4-0-0** |

**ఆంధ్రగ్రంథమాల, మదరాసు 1.**